
PARLE
Parle-G




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## అమెరికాలోనూ నిరక్షరాస్యత!

మహాత్మాగాంధి బారిష్టర్ అయ్యాక, దక్షిణ ఆఫ్రికాలో న్యాయవాద వృత్తిని మొదట చేపట్టాడు. ఆయనలాగే ఆనాడు పలువురు విదేశాలలో చదివి అక్కడే స్థిరపడిపోయారు. మరి ఇప్పుడేమో మనదేశం లోనే ఉన్నత విద్యను అభ్యసించి, ధనార్జన కోసం అమెరికా, ఇంగ్లాండు వంటి అభివృద్ధి చెందిన దేశాలకు వెళ్ళేవారి సంఖ్య ఎక్కువయింది. ఈ వలసను అరికట్టడం ఎలా అన్న సమస్య ఇవాళ చర్చనీయాంశంగా ఉంటున్నది!

అయితే, ఇటీవల అమెరికాలోని అక్షరాస్యతను గురించి దిగ్భ్రాంతి కలిగించే కొన్ని విషయాలు వెలుగులోకి వచ్చాయి. సుసంపన్న దేశమైన అమెరికా జనాభాలో సగం మందికి చదవడం,రాయడం అంతంత మాత్రమే వచ్చు. ఇక లెక్కల సంగతి సరేసరి. అందువల్ల వారికి ఉద్యోగావకాశాలు దుర్లభమవుతున్నాయి!

అమెరికాలోని 19,10,00,000 మంది వయోజనులలో 9,0000,000 మందికి చదువు అంతంత మాత్రమే. వారిలో 5,000,0000 మందికి కేవలం దరఖాస్తు పూర్తిచేయడం కూడా చేతకాదని అమెరికా విద్యాశాఖ జరిపిన ఒక సర్వేలో తెలియవచ్చింది. అంటే సగం మంది నిరక్షరాస్యులన్న మాట! ఈ పరిస్థితిలో మన దేశం నుంచీ, ఇతర ఆసియా దేశాల నుంచీ వెళ్ళే విద్యార్థులకు అక్కడ ఉద్యోగావకాశాలు లభించడంలో ఆశ్చర్యం లేదు!

మన దేశంలో నిరక్షరాస్యతా నిర్మూలనకు కేంద్ర, రాష్ట్ర, జిల్లా, నగర, గ్రామ స్థాయిలలో ఇటీవల బహుముఖ కృషి జరుగుతున్నది. ఈ విషయంలో అమెరికా మనదేశాన్ని అనుసరించడం సత్ఫలితాల నివ్వవచ్చు!



సంపుటి: 92 నవంబర్ '93 సంచిక: 5

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



వార్తలు - విశేషాలు :

# భయంకర భూకంపం!




ఈ సంవత్సరం గణేశ చతుర్థి సెప్టెంబర్ 19వ తేదీ వచ్చింది. పది రోజుల తరవాత గణేశ నిమజ్జన ఉత్సవాలు మహారాష్ట్రతో పాటు మనదేశంలో ఇతర ప్రాంతాలలో కూడా భక్తులు ఎంతో ఉత్సాహంగా జరుపుకున్నారు.

సెప్టెంబర్ 29వ తేదీ సాయంత్రం మహారాష్ట్రలోని లాటూరు జిల్లా ఖిల్లారీ గ్రామ ప్రజలు "గణపతి బాప్పా మోర్యా" అంటూ భక్తి గీతాలు పాడుకుంటూ గణేశ విగ్రహాలను ఊరేగింపుగా తీసుకు వెళ్ళారు. నిమజ్జనం జరిగాక, "వచ్చే సంవత్సరం రావయ్యా, బొజ్జ గణపతయ్యా", అని మొక్కుకుని ఇళ్ళకు చేరారు.

వాళ్ళు ఇళ్ళు చేరే సరికి బాగా పొద్దు పోయింది. అప్పటికే చాలామంది బాగా అలిసిపోయారు. కాబట్టి పడుకుని హాయిగా నిద్రపోయారు. మరికొందరు మాత్రం ఆ రాత్రంతా ఆటపాటలతో కబుర్లతో గడపాలని ఇళ్ళనుంచి బయటకు వచ్చారు. అలా బయట ఉన్న వాళ్ళు మాత్రమే ప్రాణాలతో మిగిలారే తప్ప, ఇళ్ళ లోపల నిద్రపోతున్న వాళ్ళందరూ దారుణమైన భూకంపానికి గురై ప్రాణాలు కోల్పోయారు. వేకువ జామున 4 గంటల సమయంలో కొన్ని క్షణాలు మాత్రమే వాటిల్లిన భూకంపం మరాఠ్వాడా ప్రాంతంలో యాభై గ్రామాలనూ, రెండు పట్టణాలనూ నేల మట్టం చేసింది!

వింధ్యకు దక్షిణంగా ఉన్న కొన్ని రాష్ట్రాలను కుదిపిన ఈ భూకంపం రిక్టర్ స్కేలులో 6.5 శక్తివంతమైనదని నిపుణులు అభిప్రాయపడుతున్నారు. భూకంపం అంత శక్తివంతమైనది కాకపోయినప్పటికీ అది ఏర్పరచిన ప్రాణ నష్టం మాత్రం మహాభయంకరమైనది. ముప్పై వేలకుపైగా ప్రాణాలు కోల్పోయి ఉంటారనీ, లక్ష మందికి పైగా భూకంప బాధితులు ఉంటారనీ మొదటి అంచనాలు తెలియజేస్తున్నవి. భూకంప ప్రాంతంలో మట్టితో కట్టిన పెంకుటిళ్ళే ఎక్కువ కావడంతో, ఒక్క ఇల్లు కూడా మిగలకుండా అన్నీ నేల మట్టమయ్యాయని చెబుతున్నారు. దేవాలయం ఒకటి కూలిపోయిందిగాని, అందులోని గణేశ విగ్రహం మాత్రం చెక్కుచెదరకుండా ఉన్నదని ఒక వార్త తెలియజేస్తున్నది!

1967వ సం॥లో మహారాష్ట్రలోని కోయ్‌నా డామ్ కేంద్రంగా రిక్టర్ స్కేల్ 6.5 శక్తితో భూకంపం వచ్చింది గాని, 200 మంది మాత్రమే ప్రాణాలు కోల్పోయారు. 1991వ సం॥లో ఉత్తర ప్రదేశ్‌లోని ఉత్తర కాశిలో సంభవించిన భూకంపం (6.1)లో 2,000 మందికి పైగా ప్రాణాలు కోల్పోయారు, 80,000 మంది భూకంప బాధితులయ్యారు. గత సంవత్సర కాలంగా ఖిల్లారిలో దాదాపు 125 సార్లు స్వల్ప కంపనాలు రికార్డయ్యాయి కాని, ఇంతలో ఇటువంటి భయంకరమైన భూకంపం వాటిల్లుతుందని ఎవరూ ఊహించ లేకపోయారు. సెప్టెంబర్ 30వ తేదీ ఖిల్లారీ కేంద్రంగా వాటిల్లిన భూకంపం భయానకమైన పర్యవసానా లను సృష్టించింది.

భూకంపం సంభవించిన మరునాడే దేశం నలు మూలల నుంచి వివిధ సేవాసంస్థలకు చెందిన కార్యకర్తలు ఖిల్లారీకి చేరి సహాయ కార్యక్రమాలు చేపట్టారు. శిథిలాలలో చిక్కుకుపోయిన వాళ్ళనూ, శవాలనూ వెలుపలికి తీశారు. ప్రభుత్వం తన యంత్రాంగం ద్వారా ఆహారం, బట్టలు, బస, వైద్య సదుపాయం మొదలైన వాటికి ఏర్పాట్లు చేసింది. పునరావాస కార్యక్రమాలకు పెద్ద ఎత్తున ఆర్థిక సహాయం అందజేస్తున్నది. దేశ ప్రజల నుంచే కాకుండా ప్రపంచం నలుమూలల నుంచీ ధనరూపంలోనూ వస్తు రూపంలోనూ సహాయాలు అందుతున్నవి. మన దేశంలో సంభవించిన ఘోర దుర్ఘటనకు యావత్ ప్రపంచం స్పందించింది.

భూకంపాలు రావడానికి శాస్త్రవేత్తలు రకరకాల కారణాలు చెబుతారు. అయితే భూకంపం వస్తుం దని ముందే తెలుసుకోవడానికి ఇంకా సాధ్యం కాకుండా ఉన్నది. భూగర్భ జలాలు ఇంకిపోవడం వల్ల భూమి లోపల ఖాళీ ఏర్పడి పైపొరలో పగుళ్ళు ఏర్పడడం వల్ల భూకంపం సంభవిస్తుందని కూడా చెబుతారు.

మనిషి భూగర్భ జలాల కోసం లోతుగా తవ్వుతున్నాడు. భూమి పైపొరను వేళ్ళతో పట్టి వుంచే చెట్టు చేమలను నాశనం చేస్తున్నాడు. అందువల్లే ఇటువంటి ఘోర ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తున్నాయని మరికొందరు శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

అమెరికాకు చెందిన చార్లెస్ ఫ్రాన్సిస్ రిక్టర్ (1900-1985) అనే భూగర్భ శాస్త్రవేత్త భూకంప తరంగాల ఉధృతిని తెలిపే స్కేల్‌ను (1–10) రూపొందించాడు. దీనినే 'రిక్టర్ స్కేల్' అని అంటారు. ఇంతకు పూర్వం ఇటాలియన్ శాస్త్రవేత్త గ్లసెప్పీమెర్కాలీ (1850–1914) రూపొందించిన 'మెర్కాలీ స్కేల్' ఉపయోగంలో ఉండేది.

## పెద్ద భూకంపాలు

**ఇండియాలో....**

★ 1737 అక్టోబర్ 11 కలకత్తా-3,00,000 మందికిపైగా మరణించారు.

★ 1934 జనవరి 15, ఇండో-నేపాల్ సరిహద్దులో (8.4) 10,000 మంది మరణించారు.

★ 1935 మే 31 - క్వెట్టా (ప్రస్తుతం పాకిస్తాన్‌లో వుంది.) (7.5) 30,000 మంది మరణించారు.

★ 1941 జూన్ 26 - అండమాన్ దీవులు (8.1)

★ 1950 ఆగస్టు 15 - అస్సాం (8.5)

**ప్రపంచంలో....**

★ అత్యంత భీకరమైన భూకంపం 1201వ సం॥లో తూర్పు మధ్యధరా ప్రాంతంలో సంభవించిందని చెబుతారు. 11,00,000 మంది మరణించారు.



# అసలుధనం

రాచవరం అనే గ్రామంలో, గంగాధరం ఒక చిన్న వ్యాపారి. ప్రసవానికి పుట్టింటికి వెళ్ళిన భార్యనూ, ఆమె కన్న కొడుకునూ చూసి, అతడు ఇల్లు చేరే సమయానికి సాయంకాలం కావస్తున్నది. అతడు దూరం నుంచి తమ ఇంటి ముందు ఆగివున్న గుర్రపు బండిని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ బండికి పట్టు తెరలు వున్నవి. అతడి తల్లి అన్నపూర్ణ బండి దాకా వెళ్ళి, లోపలవున్న వారికి వీడ్కోలు చెప్పింది.

గంగాధరం ఇంటి ముందుకు వచ్చే లోపల బండి కనుచూపు మేరదాటి పోయింది. అన్నపూర్ణ గంగాధరాన్ని చూస్తూనే, "ఏరా బాబూ! కోడలి ఆరోగ్యం బావుందికదా. మన వడు ఏమైనా కాస్త ఒళ్ళు చేశాడా?" అని అడిగింది.

"అంతా బాగానే వున్నారు. మనింటికి ఎవరో సంపన్నులు వచ్చినట్టుంది — బండికి పట్టు తెరలూ అవీ. ఎవరు వారు?" అని అడిగాడు గంగాధరం.

ఆ ప్రశ్న వింటూనే అన్నపూర్ణ ఉలిక్కి పడి, అంతలోనే సర్దుకుని, "వాళ్ళా! వాళ్ళు ఎంతో మందిలేరు. నా చిన్న నాటి స్నేహితురాలు ఇటువైపుగా రావడంతో పలకరించి వెళ్ళింది," అన్నది.

"నీకు అంత గొప్పస్నేహితురాలు వున్నట్టు ఏనాడూ చెప్పనే లేదు!" అన్నాడు గంగాధరం ఆశ్చర్యపోతూ.

"ఒకప్పుడు ఆమె కుటుంబం మధ్యతరగతి వాళ్ళే. క్రమంగా అదృష్టం కలిసొచ్చి లక్షాధికారులయ్యారు. మీ నాన్న పోయాక ఐదారేళ్ళ పాటు మనం అష్టకష్టాలు పడలేదూ! ఏదో ఆతరవాత మనకు అదృష్టం కలిసొచ్చింది," అన్నది అన్నపూర్ణ.

గంగాధరానికి ఎనిమిదేళ్ళ వయసులో తండ్రి పోయాడు. వాళ్ళ గుడిసె చుట్టూ

మాచిరాజు కామేశ్వరరావు

వున్న స్థలంలో కొబ్బరి చెట్లు వుండేవి. గంగాధరం కొబ్బరి బోండాలు తోపుడు బండిలో పెట్టుకుని, వీధివీధికీ తిరిగి అమ్మేవాడు. తల్లి నాలుగైదిళ్ళలో పాచిపని చేసేది. గంగాధరం చిన్నతనం నుంచీ తల్లికి చేదోడు వాదోడుగా వుంటూ, ఈనాటికి ఒక మంచి ఇల్లు కట్టుకో గలిగాడు.

అతడు పెరట్లోని బావి దగ్గిర కాళ్ళుకడుక్కుని తిరిగి వచ్చి, తల్లిని, "ఇంతకూ, నువ్వూ, నీ చిన్న నాటి స్నేహితురాలూ ఏమేం కబుర్లు చెప్పుకున్నారేం?" అని అడిగాడు నవ్వుతూ.

"ఆవిడ ఉబుసుపోని కబుర్లాడేందుకేం రాలేదు. ఆవిడ ఒక్కగా నొక్క కొడుకు పెళ్ళి, ఒకవారం రోజుల్లో జరగబోతున్నది. మనను నాలుగు రోజులు ముందుగా రమ్మని చెప్పి వెళ్ళింది," అన్నది అన్నపూర్ణ.

గంగాధరం కొంచెంసేపాలోచించి, "ఎంత స్నేహితురాలైనా, అంత గొప్ప వాళ్ళింటికి నాలుగు రోజులు ముందుగా వెళ్ళి కూర్చో వడం వాళ్ళకూ, మనకూ కూడా అసౌకర్యం. ఒక్క రోజు ముందుగా వెళదాం, సరేనా?" అన్నాడు.

అన్నపూర్ణ అయిష్టంగానే సరేనన్నట్టు తల వూపింది. తీరా పెళ్ళికి బయలుదేరే రోజున ఆమె గంగాధరానికి, తను కొన్న ఖరీదైన దుస్తులు చూపుతూ, "ఇవి పెళ్ళి కొడుకు కోసం కొన్నాను. ఎలా వున్నవి?" అని అడిగింది.

గంగాధరం అయిష్టంగా ముఖం పెట్టి, "బాగానే వున్నవి. కాని, సంవత్సరంగా అనారో



గ్యంతో వున్న నిన్ను పట్నం తీసుకుపోయి మంచి వైద్యుడికి చూపాలని కూడబెట్టిన డబ్బులో, ఏ నాలుగైదు వందలో ఖర్చు చేశావు. అదే నాకు చాలా బాధగా వుంది!" అన్నాడు.

అన్నపూర్ణ ఏదో జవాబివ్వబోయి, గట్టిగా రెండు గుటకలు మింగి మౌనంగా వుండి పోయింది.

వాళ్ళు పెళ్ళివారిల్లు చేరే సరికి సాయంత్రం కావస్తున్నది. తెల్లవారితే పెళ్ళి. అక్కడ ఖరీదైన దుస్తుల్లోవున్న మనుషులు,అతి సాధారణంగా వున్న ఆ తల్లీ కొడుకులను పట్టించుకోలేదు.

వాళ్ళు రెండు మూడు గదులు తిరిగాక, అన్నపూర్ణ స్నేహితురాలు ఇందుమతి కనిపించి, "ఆహాఁ, వచ్చావా!" అంటూ ఎంతో ఆప్యాయంగా అన్నపూర్ణ చెయ్యి పట్టుకున్నది నవ్వుతూ.

"ఇంతకూ పెళ్ళికొడుకెక్కడ?" అని అడిగింది అన్నపూర్ణ.

"నువ్వూ, నీ ఆత్రం! రా చూపిస్తాను," అంటూ ఇందుమతి, తల్లీకొడుకుల్ని, వెనక వైపు భవంతిలోకి తీసుకువెళ్ళింది.

అక్కడ ఒక పెద్ద గదిలో పెళ్ళికొడుకు శౌరీ, అతడి మిత్రులూ ఏవో కబుర్లాడుతూ బిగ్గరగా నవ్వుకుంటున్నారు.

తల్లి ఇందుమతిని చూస్తూనే శౌరి ముఖం చిట్లించి, "అమ్మా, నీ కెన్ని సార్లు చెప్పాను, నేను స్నేహితులతో వున్నప్పుడు, ఏదో అనవసరమైన పనికట్టుకు రావద్దని!" అన్నాడు.





ఆ కటువైన మాటలకు ఇందుమతి చిన్నబుచ్చుకుని, "ఏదో నా స్నేహితురాలు నిన్ను చూస్తానంటే వెంటబెట్టుకు వచ్చాను," అన్నది.

"అడ్డమైన వాళ్ళందరూ నీకు స్నేహితురాళ్ళే!" అన్నాడు శౌరి, అన్నపూర్ణ, గంగాధరం కేసి ఈసడింపుగా చూస్తూ.

అన్నపూర్ణ ఆ మాటలు పట్టించుకోకుండా శౌరిని సమీపించి, "పెళ్ళి చేసుకుని నూరేళ్ళు సుఖంగా వుండు, బాబూ!" అంటూ తను తెచ్చిన కొత్త దుస్తులు అతడికిచ్చింది.

శౌరి వాటిని అటూ ఇటూ తిప్పిచూసి, "సమయానికి మంచి బహుమతే తెచ్చావు! మా పాలేరు, నా పెళ్ళికి కొత్తబట్టలు కుట్టించలేదని అడిగాడు," అంటూ పాలేరును పిలిచి వాటిని వాడి చేతిలో పెట్టాడు.

అన్నపూర్ణా, ఇందుమతీ ముఖముఖాలు చూసుకుని తలవంచుకుని, గదినుంచి బయిటికి వచ్చేశారు. గంగాధరం కోపంతో ఉడికిపోయాడు.

పెళ్ళి రెండు వీధుల అవతల వున్న రాజభవనం లాంటి ఆడపెళ్ళి వారింట్లో ఘనంగా జరిగింది.

పెళ్ళికూతురు పరమ అనాకారి. ఆ మాటే శౌరి స్నేహితులంటే, దాపుల తల్లీ, అన్నపూర్ణా, గంగాధరం వున్నారని కూడా లెక్క చేయకుండా అతను, "ఏం చేసేది మరి! నా కిప్పుడు చేస్తున్న వ్యాపారంలో తృప్తి లేదు. సముద్రవ్యాపారానికి బోలెడు పెట్టుబడి కావాలి. వీళ్ళు కట్నంగా ఐదు లక్షలిస్తామంటే అనాకారని చూడకుండా పెళ్ళికొప్పుకున్నాను. అంతా నిశ్చయమయ్యాక మరొకళ్ళు – ఆ పెళ్ళి కూతురు ఈవిడ కన్న మరింత అనాకారి – ఎనిమిది లక్షలిస్తామన్నారు. ఏం లాభం! అంతా నా దురదృష్టం," అంటూ నిట్టూర్చాడు.

ఇది విని గంగాధరం నిర్ఘాంతపోయాడు. అన్నపూర్ణ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

తర్వాత ఇద్దరూ బాడుగబండిలో, ఇంటికి తిరుగుప్రయాణమయ్యారు. తల్లి ఎక్కడలేని విచారంతో, మధ్యమధ్య పయిట చెంగుతో కళ్ళు తుడుచుకోవడం గమనిస్తున్న

గంగాధరం, ఇక వుండబట్టలేక, "అమ్మా! శౌరి అవమానకరంగా ప్రవర్తించిన తీరు, ఇంకా నిన్ను బాధిస్తూనే వున్నదా? ఏం చేస్తాం, వాడు పొగరుబోతు, ఇక ఊరుకో!" అన్నాడు.

"ఆ శౌరి ఎవరనుకుంటున్నావు?" అన్నది అన్నపూర్ణ వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ. ఆ ప్రశ్నకు గంగాధరం ఆశ్చర్యపోయి, "నువ్వే చెప్పావుకదా, నీ స్నేహితురాలు ఇందుమతి కొడుకని!" అన్నాడు.

"కాదు, నీ తమ్ముడు!" అని అన్నపూర్ణ కొంచెం ఆగి, "ఇన్నేళ్ళుగా, నా మనసులోనే దాచుకున్న ఆ రహస్యాన్ని, ఇక ఇప్పుడు నీకు చెప్పక తప్పదు!" అంటూ గంగాధరానికి చెప్పింది:

భర్త పోయిన కొత్తల్లో అన్నపూర్ణ, ఇరుగు పొరుగు ఇళ్ళల్లో దొరికిన పని ఏదో ఒకటి చేస్తూండేది. అప్పుడు గంగాధరానికి ఎనిమి దేళ్ళు. అతడు వీధుల్లో కొబ్బరి బోండాలు అమ్ముతూండేవాడు. అతడి తమ్ముడైన శౌరికి రెండేళ్ళ వయసు.

ఒకనాటి మిట్టమధ్యాహ్నం వేళ, ఇందు మతి బాడుగబండిలో తన ఊరుకు తిరిగి పోతూ వడదెబ్బ తిన్నది. ఆమెకు స్పృహ తప్పడం చూసి, బండివాడు, కంగారు పడి బండిని అన్నపూర్ణ వాళ్ళ గుడిసె ముందు ఆపాడు. అప్పుడే ఇంటికి తిరిగివస్తున్న గంగాధరం, చప్పున ఒక కొబ్బరి బోండాం



కొట్టి ఇందుమతి ముఖం మీద చల్లి, మరొక బోండాం నీళ్ళు ఆమె చేత తాగించాడు.

సాయంత్రం దాకా వాళ్ళ గుడిసెలో విశ్రాంతి తీసుకున్నాక, ఇందుమతి కోలుకున్నది. ఆమె కళ్ళకు ఎనిమిదేళ్ళ గంగాధరం దేవు డిలా కనిపించాడు.

వెళ్ళేముందు ఇందుమతి, అన్నపూర్ణను పక్కకు పిలిచి, "నీ కొడుకు ఈ రోజు నా ప్రాణం కాపాడాడు. మాకు పిల్లలు లేరు. ఎవరినైనా దత్తు తీసుకోవాలనుకుంటున్నాం. నీకు అభ్యంతరం లేకపోతే గంగాధరాన్ని నేనే పెంచుకుంటాను. బాగా ఆలోచించుకుని, ఏ సంగతీ నాలుగు రోజుల్లో వచ్చి నాకు చెప్పు," అని తన పేరూ, ఊరూ వున్న ఒక

చిన్న చిరునామా కాయితాన్ని ఆమె చేతిలో పెట్టింది.

"గంగాధరం ఎదిగాడు! తనకు చేదోడుగా వున్నాడు. వాడిని దత్తత కిస్తే తన కష్టం మరింత పెరుగుతుంది. చిన్నవాడు శౌరి పోషణ తనకు కష్టంగా వుంది. ఇష్టం లేక పోయినా, వాడిని ఇచ్చేస్తే, వాడి భవిష్యత్తు బావుంటుంది!" అన్నపూర్ణ ఇలా ఆలోచించి, తను పుష్కరస్నానాలకు వెళుతున్నానని చెప్పి, శౌరిని ఇందుమతి చేతిలో పెట్టింది.

"ఇదీ బాగానేవుంది! వీడికి బాల్యంగుర్తుం డదు. మా పిల్లవాడిననే అనుకుంటాడు. అయితే ఒకటి. మళ్ళీ జన్మలో నువ్వీ గడప తొక్కకూడదు. తెలిసిందా?" అంటూ ఇందు మతి పదివేల రూపాయిలు అన్నపూర్ణకు ఇవ్వబోయింది.

అన్నపూర్ణ ఆ డబ్బును తీసుకోకుండా, "నేను నా కొడుకును అమ్ముకోవడం లేదు. వాడి భవిష్యత్తు కోసం మనసు రాయిచేసు కుని త్యాగం చేస్తున్నాను. కనీసం వాడి పెళ్ళి రోజునయినా నన్ను పిలిస్తే, తల్లిగా నాలుగక్షింతలు చల్లి వెళతాను," అని చెప్పి ఇంటికి వచ్చేసింది.

తర్వాత అన్నపూర్ణ ఊళ్ళో అందరికీ, పుష్కరాల్లో కొడుకు తప్పిపోయినట్టు చెప్పి, నమ్మించింది.

ఇదంతా చెప్పి ఆమె, "నిజానికి ఆ శౌరి వైభోగమంతా నీది కావలసింది! ఆ ఇందు మతి ముందు నిన్నే దత్తు చేసుకుంటాన న్నది," అంటూ విచారపడింది.

గంగాధరం నవ్వి, "అమ్మా! లోకంలో సుఖంగా, తృప్తిగా బతకడానికి డబ్బొక్కటే కాదు ముఖ్యం. ఎంత ఆస్తి వున్నా తమ్ముడు శౌరికి తృప్తిలేదు. కట్నం ఆశించి కురూపిని భార్యగా తెచ్చుకున్నందుకు బాధ. మరింత కట్నం తెచ్చే అమ్మాయిని చేసుకోలేనందుకు నిరాశ. ఇందువల్ల, తమ్ముడికి లేని అసలుధనం తృప్తి అనేది నాకు పుష్కలంగా వుంది!" అన్నాడు.

ఆ జవాబుతో, తల మీది నుంచి కొండంత బరువు దింపుకున్నట్టుగా ఆనందపడింది అన్నపూర్ణ.






[శతాబ్దికపుష్పాలతో పడవలో బయలుదేరిన ఉత్తుంగుడికి అర్ధరాత్రి సమయంలో సముద్రమధ్యంలో రాకాసి మృగం కనిపించింది. ఉత్తుంగుడు భూప్రదేశం కోసం వెతుకుతూ ఉండగా ఒక పెద్ద అలలేచి, పడవను తీరానికి విసిరికొట్టింది. అతడు నిద్రలో ఉండగా కొందరు కోయయువతులు వచ్చి, శతాబ్దిక పుష్పాలను తీసుకుని తమ గూడానికి బయలుదేరారు. ఉత్తుంగుడు కూడా వాళ్ళ వెంట గూడెం చేరాడు. — తరవాత]

"శృంగ్మాయ్ కొండల ప్రాంతం నుంచి ఇంత దూరం ఇక్కడికి ఒంటిరిగా ఎలా వచ్చావు?" అంటూ కూర్చోవడానికి పరచి ఉన్న చాపను చూపాడు దృఢకాయుడు.

ఉత్తుంగుడు చాప మీద కూర్చుంటూ, "నేను మాణిక్యపురి దక్షిణ సరిహద్దు నుంచి నిన్న సాయంకాలం పడవలో బయలుదేరాను. తెల్లవారుతూ ఉండగా ఒక పెద్ద అలలేచి నా పడవను తీరం మీదికి విసిరి కొట్టడంతో గట్టు మీద పడ్డాను. అంతేగాని నేను ఇక్కడికి ఉద్దేశపూర్వకంగా రాలేదు," అన్నాడు.

అంతలో గుడిసె లోపలి గది నుంచి మధ్య వయస్కురాలు రెండు వెడల్పాటి పాత్రల నిండా ఏదో పానీయం తెచ్చి వాళ్ళ ముందు పెట్టి లోపలికి వెళ్ళింది.

దృఢకాయుడు తానొక పాత్ర తీసుకుని ఉత్తుంగుడికి మరొక పాత్ర చూపుతూ, "తీసుకో," అన్నాడు.



చుట్టూ కొందరు యువతులు చేరారు. పడవలో నేను తెచ్చిన పూలను తీసుకుని నిలబడ్డారు. వాళ్ళ మాటలు నాకు అర్థం కాలేదు కాని, వాళ్ళు చేసిన సైగలను అర్థం చేసుకుని వాళ్ళ వెంట ఇక్కడికి వచ్చాను," అన్నాడు. ఉత్తుంగుడు.

ఈ లోగా లోపలికి వెళ్ళిన స్త్రీ పూలకట్టను తెచ్చి, దృఢకాయుడి ముందు ఉంచి, "కాబూయీ, మన అమ్మాయి ఈ పూలను తెచ్చింది. అందంగా ఉన్నాయి కదూ!" అన్నది.

"బాగున్నాయి. అయినా, మన అమ్మాయి వాటినెందుకు తెచ్చింది?" అని అడిగాడు దృఢకాయుడు.

"అవి మంచి వాసన వేస్తున్నవి. అందువల్ల ఇష్టపడి తెచ్చుకున్నది," అన్నది స్త్రీ.

"ఆ యువకుడు వాటిని ఎక్కడికో తీసుకుని వెళుతున్నాడు! వాటినెందుకు ఇక్కడికి తేవాలి?" అని అడిగాడు దృఢకాయుడు.

ఆ స్త్రీ సమాధానం చెప్పకుండా మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది. వాళ్ళ మాటలు అర్థంకాలేదు కాని 'కాబూయీ' అంటే నాయకుడు అన్న విషయం గ్రహించాడు ఉత్తుంగుడు.

"వీటిని శతాబ్దికపుష్పాలంటారు. ఒక ముఖ్యమైన పనిమీద పువ్వులను దూర ప్రాంతానికి తీసుకువెళుతున్నాను," అన్నాడు ఉత్తుంగుడు అసలు విషయాన్ని బయటపెట్టకుండా.

"మీ మాణిక్యపురికి సమీపంలో ఉన్న మా రాజ్యాన్ని నాగపురి అంటారు. ఇక్కడి

"నేనిక్కడికి రాగానే, ఆమె నాకు పానీయం ఇచ్చి నా ఆకలి తీర్చింది," అంటూ పాత్రను అందుకున్నాడు ఉత్తుంగుడు.

"ఇక్కడికి ఎప్పుడు వచ్చావు?" అని అడిగాడు దృఢకాయుడు.

"నేను ఇక్కడికి రాలేదు. నన్ను ఇక్కడికి తీసుకువచ్చారు," అన్నాడు ఉత్తుంగుడు.

"ఎవరు తీసుకువచ్చారు?" అని అడిగాడు దృఢకాయుడు.

పాత్రలో ఉన్న పానీయాన్ని తాగి పాత్రను కింద పెడుతూ, "గట్టుమీద పడవతో సహా ఎగిరి పడ్డ నేను, అప్పటికే బాగా అలిసిపోయాను. కొంతసేపు విశ్రాంతి తీసుకుందామని కళ్ళు మూశాను. మెలకువ వచ్చేసరికి

నుంచి నువ్వు ఇంకా ఎంత దూరం వెళ్ళాలి? ఆలోగా ఈ పువ్వులు వాడిపోతాయి కదా!" అన్నాడు కాబూయీ, ఉత్తుంగుడి నుంచి అన్నివిషయాలూ రాబట్టాలన్న ఉద్దేశంతో.

ఉత్తుంగుడు కూడా ఇక దాచి ప్రయోజనం లేదని గ్రహించి, తన ప్రయాణం గురించిన సంగతులన్నిటినీ కాబూయీకి క్లుప్తంగా వివరించాడు. అంతా విన్న కాబూయీ, "రాకాసి మృగాన్ని నడి సముద్రంలో ఎదుర్కోవడానికి సిద్ధపడిన నీ సాహసం మెచ్చతగినది. ఆపదలో ఉన్న మీ రాజ్యప్రజలను కాపాడడానికి పూనుకున్న నువ్వు ఆదర్శ యువకుడివి. ఆ రాకాసిమృగం వల్ల మా నాగపురికి ఎటువంటి ఆపదారాదు. ఎందుకంటే మా రాజ్యం చుట్టూ ఎత్తయిన పర్వతాలు కోటగోడల్లా ఉన్నాయి. అది ప్రకృతి మాకు ప్రసాదించిన వరం. మా రాజ్యానికి శత్రువుల బెడదలేదు. మేము సుఖ శాంతులతో జీవిస్తున్నాము," అన్నాడు.

"నిజమే. అయితే , మా మాణిక్యపురికి సుదీర్ఘమైన సముద్రతీరం ఉన్నది. అందుకే రాకాసిమృగం మా రాజ్యంలో నానా బీభత్సం సృష్టిస్తున్నది. కాబట్టి దాని నివాసానికే ఈ పూలను చేర్చడం తప్ప మరొక మార్గం కనిపించడం లేదు," అన్నాడు ఉత్తుంగుడు.

"మీ కొండలలో పూచిన శతాబ్దిక పుష్పాలను కోయడానికి చెట్లన్నిటినీ మొదలంట నరికి పడగొట్టినట్టూ, అవి మళ్ళీ పూయడానికి వంద సంవత్సరాలు పట్టవచ్చుననీ ఇప్పుడే



కదా చెప్పావు. మరి రాకాసిమృగం ఆ పూల కోసం మాణిక్యపురికి వచ్చే అవకాశమే లేదు కదా?" అని అడిగాడు కాబూయీ.

"మీరన్నది నిజమే. అయినా ఆ దుష్ట మృగాన్ని మా రాజ్యం నుంచి వీలయినంత దూరం అవతలకి తీసుకు వెళ్ళాలన్న నిశ్చయంతో ఉన్నాను," అన్నాడు ఉత్తుంగుడు.

"నీ ప్రయత్నం మంచిదే. అయినా ఆ రాకాసి మృగాన్ని మీ రాజ్యానికి రాకుండా చేయడానికి మరేదైనా మార్గమున్నదేమో ఆలోచించడం మంచిదనుకుంటాను. ఈ విషయాలను మా రాజు గారికి చెప్పి ఆయన సలహా పొందడం అన్ని విధాలా మంచిదని భావిస్తున్నాను. భోజనం చేసి ఈ రోజే నిన్ను



మా రాజు మహేంద్రసింహుడి దగ్గరికి తీసుకు వెళతాను," అని ఉత్తుంగుడికి చెప్పి, లోపలి తలుపు తట్టాడు కాబూయీ.

ఇంటి లోపలి నుంచి ఆ స్త్రీ అక్కడికి వచ్చింది. కాబూయీ ఏదో చెప్పాడు. ఆమె లోపలికి వెళ్ళి మరుక్షణమే ఆహార పదార్థాలు తెచ్చి ఉత్తుంగుడి ముందు ఉంచింది. ఆమెవెంట మరొక యువతి కూడా వచ్చింది. పాత్రలను ఉంచి ఆమె లోపలికి వెళుతూండగా కాబూయీ ఆమెను 'చిత్రా' అని పిలిచాడు. ఆమె ఆగి, "పిలిచారా," అంటూ కాబూయీ కేసి తిరిగింది.

"అవును, ఇలా రా," అని కాబూయీ ఉత్తుంగుడి కేసి తిరిగి, "ఈమె మా కూతురు, చిత్ర," అని చెప్పి చిత్ర కేసి తిరిగి, "మిగతా వాళ్ళెక్కడ?" అని అడిగాడు.

ఆమె తలుపును చిన్నగా రెండు మూడు సార్లు తట్టింది. లోపలి నుంచి ఐదుగురు యువతులు అక్కడికి వచ్చారు.

కాబూయీ ఉత్తుంగుడితో, "వీళ్ళందరూ చిత్ర స్నేహితురాళ్ళు," అని చెప్పి వాళ్ళ కేసి తిరిగి, "ఈ పూలను పడవ నుంచి ఎందుకు తెచ్చారు?" అని అడిగాడు.

"పువ్వులు చాలా అందంగా ఉన్నాయి. మంచి వాసన వేస్తున్నాయి. అందుకే తీసుకు వచ్చాము," అన్నారు వాళ్ళు ఉత్తుంగుడి కేసి తదేకంగా చూస్తూ.

"సరే లోపలికి వెళ్ళండి," అన్నాడు కాబూయీ.

"అలాగే!" అంటూ ఆ యువతులు లోపలికి వెళ్ళారు.

భోజనం చేసి కాబూయీ, ఉత్తుంగుడూ రాజదర్శనానికి బయలుదేరారు. కాబూయీ భార్యా, కూతురూ వాళ్ళను వాకిలి వరకు వచ్చి సాగనంపారు.

గూడెం దాటగానే కాబూయీ, తన చేతిలోని పూలకట్టను ఉత్తుంగుడి చేతికిచ్చి, "ఇది నీ దగ్గరే ఉంచు," అని ముందు నడవ సాగాడు.

ఆ పూలను తీసుకుని ఉత్తుంగుడు కాబూయీ వెంట మౌనంగా నడవ సాగాడు. వాళ్ళు అలా చాలా దూరం వెళ్ళి ఎగుడు

దిగుడుగా ఉన్న ఒక చిన్న కొండను దాటి మరికొంత దూరం నడిచి నాగపురి రాజధానీ నగరాన్ని సమీపించారు.

రాజధానీ నగరవీధులలో నడుస్తూంటే పౌరులు కొందరు కాబూయీని గౌరవంగా పలకరించారు. ఎదురుగా వస్తూన్న మరి కొందరు పక్కకు తొలగి వాళ్ళకు దారి ఇచ్చారు. ఆజానుబాహువయిన కాబూయీ గంభీర రూపం, ఆయన తలమీద ఉంచుకున్న చిన్న నాగ కిరీటం, విచిత్ర వేషధారణ, చేతిలోని పెద్ద బల్లెం ఎదురుపడే వాళ్ళకు భయం కలిగిస్తున్నట్టు ఉత్తుంగుడు గ్రహించాడు.

వాళ్ళు రాజప్రాసాదాన్ని సమీపించగానే, కాపలాభటులు కాబూయీకి నమస్కరించారు. ఒక భటుడు వాళ్ళను రాజప్రాసాదం లోపలికి తీసుకుపోయాడు. ఇరువైపులా పెద్ద స్తంభాలతో మార్గం చాలా విశాలంగా ఉన్నది. వాళ్ళను ఒకచోట ఆగమని భటుడు మాత్రం లోపలికి వెళ్ళి, వాళ్ళు వచ్చిన సంగతి రాజుకు తెలియజేసి, తిరిగి వచ్చి కాబూయీనీ, ఉత్తుంగుణ్ణీ వెంటబెట్టుకుని రాజు దగ్గరికి వెళ్ళాడు.

రాజు ఉన్నతాసనం మీద కూర్చుని మంత్రులతో ఏదో చర్చిస్తున్నాడు. రాజును చూడగానే, కాబూయీ చేతులు జోడించి వంగి నమస్కరించాడు.

"కాబూయీ! మీ కాభా తెగ ప్రజలందరూ ఏ కొరతా లేకుండా క్షేమంగా ఉన్నారు



కదా!" అని పరామర్శించాడు రాజు మందహాసంతో.

"తమ దయ వల్ల అందరూ క్షేమంగానే ఉన్నాము, ప్రభూ!" అన్నాడు కాబూయీ.

రాజు దృష్టి ఉత్తుంగుడి మీద పడింది. ఉత్తుంగుడు కాబూయీ లాగానే చేతులు జోడించి వంగి రాజుకు నమస్కరించాడు.

"ఈ యువకుడు మాణిక్యపురి నుంచి వచ్చాడు. పేరు ఉత్తుంగుడు," అన్నాడు కాబూయీ.

"అలాగా! మీరాజు ప్రతాపవర్మ క్షేమంగా ఉన్నాడా?" అని అడిగాడు రాజు.

"క్షేమమే, ప్రభూ!" అన్నాడు ఉత్తుంగుడు వినయంగా.



"అలాగా! మాణిక్యపురి రాజు ప్రతాప వర్మ మన కోసం వీటిని అంత దూరం నుంచి పంపాడా?" అన్నాడు రాజు ఎంతో ఆశ్చర్యంగా.

"కాదు, ప్రభూ!" అంటూ కాబూయి శతాబ్దికపుష్పాల వల్ల మాణిక్యపురికి వాటిల్లిన ఆపద గురించీ, రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ బయలుదేరిన ఉత్తుంగుడి ప్రయాణంగురించీ క్లుప్తంగా వివరించి, "ఈ విషయాన్ని తమకు తెలియజేసి, తమ సలహా పాటించడం మంచిదని ఉత్తుంగుణ్ణి వెంట బెట్టుకుని వచ్చాను, ప్రభూ," అన్నాడు కాబూయి.

"ప్రజలక్షేమం కోసం ఉత్తుంగుడు చేస్తున్న సాహసం ప్రశంసనీయమైనది. అయినా, అతడు ఆ రాకాసిమృగాన్ని ఎదుర్కోవడానికి ఒంటరిగా వెళ్ళడం అంత క్షేమం కాదు. ఈ సాహసవీరుడికి తోడుగా మన వీరులు మరి కొందరు వెళ్ళే ఏర్పాటు చేద్దాం," అన్నాడు రాజు.

అంతలో ఒక పదిహేనేళ్ళ అమ్మాయి, "నాన్నా! ఈ పువ్వులు ఎక్కడివి? ఇవి చాలా అందంగా ఉన్నాయి!" అంటూ అక్కడికి వచ్చింది.

రాజు ఆమెను ఆప్యాయంగా దగ్గరికి తీసుకుని, "వీటిని మాణిక్యపురి నుంచి నీ కోసం ఆ యువకుడు తెచ్చాడు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

పక్కనున్న ఆసనాలలో కూర్చోమని రాజు చేయి చూపగానే ఇద్దరూ ఆ ఆసనాలపై కూర్చున్నారు.

"ఉత్తుంగుడు అనుకోకుండా మన రాజ్యానికి వచ్చాడు," అంటూ కాబూయి ఉత్తుంగుడి చేతిలోని పూలకట్టను తీసి రాజు ముందుంచాడు.

"మీరు లోపలికి రాగానే వింత పరిమళం వీచింది. ఇదా కారణం!" అన్నాడు రాజు.

"ఉత్తుంగుడు వీటిని శృంగ్మాయ్ కొండల నుంచి తెచ్చాడు. ఇవి వంద సంవత్సరాలకొకసారి మాత్రమే పూచే విచిత్ర పుష్పాలట. అందుకే వీటిని శతాబ్దిక పుష్పాలని పిలుస్తారట!" అన్నాడు కాబూయి.

"నిజంగానా! నా కోసం తెచ్చావా?" అంటూ ఆ అమ్మాయి ఉత్తుంగుడి కేసి ఆశ్చర్యంగా చూసింది.

ఉత్తుంగుడు ఏం చెప్పడానికీ తోచక చిన్నగా నవ్వాడు.

రాజు అతనితో, "ఈమె నా కుమార్తె మల్లిక. ఈమెకు పువ్వులంటే ప్రాణం!" అన్నాడు.

"అవును, యువరాణీ! ఈ పువ్వులను మీ కోసమేతెచ్చాను," అన్నాడు ఉత్తుంగుడు.

"వీటిని నేను తీసుకుంటాను, నాన్నా!" అన్నది మల్లిక తండ్రితో.

"అలాగే తల్లీ! నువ్వు లోపలికి వెళ్ళు, నేను ఇప్పుడే వస్తాను," అని రాజు చెప్పగానే మల్లిక పూలను తీసుకుని సంతోషంగా లోపలికి వెళ్ళిపోయింది.

రాజు, "ఆ పుష్పాలకున్న శాపం గురించి గానీ, రాకాసిమృగం గురించి గానీ యువరాణికి తెలియకూడదు," అని కొంత సేపు మౌనంగా ఆలోచించి, "కాబూయీ, మీరీ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకోండి. రాకాసి మృగం గురించి ఏం చేయాలో రేపు నిర్ణయిద్దాం!" అని చెప్పి అక్కడి నుంచి లేచి రాజభవనం లోపలికి నడిచాడు.

ఆయన వెళ్ళేంత వరకు మంత్రులూ, కాబూయీ, ఉత్తుంగుడూ లేచి నిలబడ్డారు. రాజు వెళ్ళాక ఒక మంత్రి కాబూయీతో, "మీరిద్దరూ నా వెంట రండి, మీకు బస ఏర్పాటుచేస్తాను," అని వాళ్ళను తీసుకుపోయి వాళ్ళకొక విశాలమైన గదిని చూపించి, "ఇక్కడ మీ అవసరాలన్నిటినీ సేవకులు చూసుకుంటారు. రేపు ఉదయం రాజుగారి నుంచి పిలుపు వచ్చేంత వరకు మీరిక్కడే విశ్రాంతి తీసుకోవచ్చు," అని చెప్పి వెళ్ళాడు.

మంత్రి వెళ్ళిన కొంతసేపటికల్లా ఒక భటుడు అక్కడికి వచ్చి, "తన కోసం పువ్వులు తెచ్చిన యువకుణ్ణి వెంటబెట్టుకుని రమ్మని యువరాణి ఆజ్ఞాపించారు!" అన్నాడు.

ఉత్తుంగుడు ఆశ్చర్యంగా కాబూయీ కేసి చూశాడు. కాబూయీ, "నువ్వు వెళ్ళిరా! అయితే, రాజుగారు చెప్పిన విషయం మాత్రం మరిచిపోవద్దు. జాగ్రత్త సుమా!" అని హెచ్చరించాడు. — (ఇంకావుంది)






# జంతుధర్మం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని ధించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అతి భయంకరమైన కారుచీకట్లో అర్ధరాత్రి సమయాన, నువ్వే కార్యం సాధించ దలచి అంతులేని ఇక్కట్ల పాలవుతున్నావో, ఇప్పటికీ నాకు తెలియని రహస్యంగానే మిగిలిపోయింది. అయితే ఒక వేళ, నిన్నేదో అసాధ్యకార్యానికి పురిగొల్పిన వాడు ఏ రాజో లేక అమాయకులచేత న్యాయ శాస్త్రంలో దిట్ట అని పిలవబడే ఏన్యాయాధికారో అయితే మాత్రం నువ్వు తగు జాగ్రత్తలో వుండడం మేలు. ఎందుకంటే – రాజైన ప్రతి వాడి నిర్ణయం, న్యాయాధికారి అయిన ప్రతి వాడి తీర్పూ సమంజసంగానూ, న్యాయసమ్మతంగానూ వుంటుందను కోవడం అజ్ఞానం అనిపించుకుంటుంది. ఇందుకు ఉదాహర

## బేతాళ కథలు



ణగా రామభద్రుడనే ఒక న్యాయాధికారి తీర్పు గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పుష్పగిరి రాజ్యంలోని ఒకానొక పల్లెలో వుండే వీరయ్యకు ఒక్కగానొక్క కొడుకు చోడయ్య. చోడయ్యకు సంగీత మంటే చిన్నప్పటి నుంచీ ఎంతో ఇష్టం. పక్షులకూతలు పరవశించి వినేవాడు. జంతువుల అరుపుల్లోనూ, వీచేగాలిలోనూ కూడా వాడికి సంగీతం వినిపించేది.

చోడయ్య అయిదు సంవత్సరాల వయసు వాడై వుండగా, సాధువొకడు వాడిని చూసి, "వీడి ముఖంలోసరస్వతివుంది. సంగీతంనేర్పించు. మహావిద్వాంసు డౌతాడు," అని చెప్పాడు.

వీరయ్య కీమాటలు నచ్చలేదు. ఆయన చిన్నప్పటినుంచీ కొడుకును వ్యవసాయంలో పెట్టాడు. అందులో అయితే తను తింటూ పది మందికి పెట్టవచ్చుననీ, సంగీతం వల్ల ఏ ప్రయోజనమూ లేదనీ ఆయన కొడుకుక్కు చెప్పేవాడు.

చోడయ్యకు వ్యవసాయం మీద ఆసక్తి లేదు. వాడు సంగీతం నేర్చుకుంటానని గోల పెట్టాడు. ఇందుకు తండ్రి వాడిని గదిలో పెట్టి తలుపులు వేసి బంధించి, రెండు రోజులు తిండి పెట్టకుండా మాడ్చాడు. ఆకలి బాధకు తట్టుకోలేక చోడయ్య అన్నింటికీ ఒప్పుకున్నాడు. ఆ తర్వాత కొడుకెప్పుడైనా ఎదురు తిరిగితే, తండ్రి వాడికి బాగా దేహశుద్ధి చేసేవాడు.

ఏమైతేనేం — పదహారేళ్ళ వయసొచ్చేసరికి చోడయ్య మంచి వ్యవసాయదారుడుగా పేరు తెచ్చుకున్నాడు. వాడి కృషి మాహాత్మ్యమో, హస్తవాసియో కానీ, ఊళ్ళో అందరికంటే వీరయ్య పొలంలోనే యేటా ఎక్కువ పంట పండేది.

ఇలా వుండగా, ఆ ఊళ్ళో కరువొచ్చింది. వరుసగా రెండేళ్ళు పంటలు లేక పోయేసరికి వీరయ్య బాగా అప్పుల పాలయ్యాడు. ఆ ఊళ్ళో వడ్డీవ్యాపారి నిర్దాక్షిణ్యంగా వీరయ్య పొలాన్ని తన స్వంతం చేసుకోవడంతో, ఆయన కుటుంబం ఊరొదిలి పెట్టక తప్పలేదు.

పట్నం బయల్దేరిన వీరయ్య కుటుంబం దారిలో ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూండగా, చెట్టు మీది నుంచి ఒక కోతి పిల్ల వాళ్ళ ముందు పడింది. అది బాగా గాయపడివుంది. వీరయ్య దాన్ని ఒడిలోకి తీసుకుని గాయాలు శుభ్రం చేసి, ఆకు పసరులు పూసి వైద్యం చేశాడు. తన దగ్గరున్న పళ్ళు దానికి పెట్టాడు. కోతిపిల్ల ఆయనకు మచ్చికయింది. అప్పుడాయన దాని మెడలో తాడు కట్టి పారిపోకుండా ఏర్పాటుచేశాడు.

వీరయ్య కుటుంబం పట్నం చేరుకుని, వుండడానికెక్కడా దారిలేక ఒక చెట్టుకింద మకాం పెట్టారు. చోడయ్య కాయకష్టం చేస్తానని నాలుగు వీధుల్లో పని కోసం తిరిగేవాడు. ఈలోగా వీరయ్య కోతికి ఆటలు నేర్పసాగాడు. మొదట్లో కోతిపిల్ల ఆయన చెప్పినట్లు వినలేదు. దాన్నాయన తిండి పెట్టకుండా మాడ్చాడు. కర్ర పుచ్చుకుని కొట్టాడు. చెప్పింది చేసినప్పుడల్లా దానికి బాగా ఎక్కువ తిండి పెట్టేవాడు. వారం రోజులు తిరిగేసరికి కోతిపిల్ల ఎన్నో విద్యలు నేర్చింది.

కోతిపిల్లను వెంట బెట్టుకుని పట్నంలో ప్రదర్శన లివ్వసాగాడు వీరయ్య. ఆవింతను చూడ్డానికి జనం విరగబడి వచ్చేవారు. ఆయనకు డబ్బులు బాగా దొరికేవి. చోడయ్య రోజంతా కష్టపడినప్పటికీ, కోతిపిల్ల వల్ల వచ్చే దాంట్లో సగం కూడా సంపాదించలేకపోయేవాడు.

ఒక రోజున చోడయ్య, తండ్రి కోతి పిల్ల చేత ఆడిస్తున్న ఆటలు చూసి ఆయనతో,





"ఈ వినోదం గొప్పగా వుంది. కానీ, కొద్ది కాలంలోనే చూసే జనానికి విసుగు పుట్టే ప్రమాదముంది. నేను డప్పువాయిస్తూ పాటలు పాడతాను. ఆ పాటలకు తగ్గ నాట్యం కోతికి నేర్పుదాం. ఒక పాట తర్వాత ఒకటి చొప్పున కొత్తది పాడుకుంటూ వెళితే, జనానికి విసుగుండదు," అన్నాడు.

ఇందుకు సరేనన్నాడు వీరయ్య. ఆ ప్రకారం చేసే సరికి కోతిపిల్ల వల్ల ఆదాయం పదిరెట్లయింది.

ఆ కుటుంబానికి సుఖంగా రోజులు గడిచి పోతున్నాయి.

ఇలా వుండగా, ఒక రోజున చోడయ్య పాడుతూండగా సంగీత విద్వాంసుడొకాయన ఆ దారిన వెళుతూ విన్నాడు. ఆయన వాడిని దగ్గరకు పిలిచి, "నీ గొంతులో తీయదనముంది; పాటలో లయవుంది. నువ్వు నా వెంట వచ్చెయ్యి. సంగీతం నేర్పుతాను," అన్నాడు.

ఇందుకు చోడయ్య సరేనన్నా వీరయ్య ఒప్పుకోలేదు. అయినా తండ్రి మాట లెక్క చెయ్యకుండా చోడయ్య, ఆ సంగీత విద్వాంసుడి వెంట వెళ్ళిపోయాడు. వీరయ్య ఎంతో బాధపడి కొడుకునూ, సంగీత విద్వాంసుణ్ణీ తెగ తిట్టుకున్నాడు.

అలా రెండు సంవత్సరాలు గడిచాయి. వీరయ్య కోతి నాడిస్తూ గడించిన డబ్బుతో చిన్న గుడిసె కొనుక్కున్నాడు. ఆయనకు రోజులు సుఖంగానే వెళ్ళిపోతున్నా, కొడుకు దగ్గర లేడనే బాధ ఎక్కువగా వుండేది. ఆ విషయమై తరచుగా భార్యాభర్తలిద్దరూ దుఃఖిస్తూండేవాళ్ళు.

ఒకరోజున కోతి ఆట చూపడానికి రమ్మని వీరయ్యకు, భాగ్యవంతుడొకడు కబురంపాడు. ఒక్క ఆటకు వెయ్యి వరహాలిస్తాననడంతో ఎంతో ఆశపడి వీరయ్య అక్కడికి వెళ్ళాడు. అంతవరకూ తన కోతి ఆటకు ఒక్క రోజులో అంత మొత్తాన్ని ఆయన కళ్ళ చూసి ఎరగడు.

వీరయ్య వెళ్ళింది చాలా పెద్ద భవనం. అందులో పట్టు తివాచీలు పరిచిన విశాలమైన గదిలో రత్నాసనం మీద విలువైన దుస్తులు

ధరించి కూర్చుని వున్న భాగ్యవంతుడు, తా నొక్కడే కోతి ఆటను చూసి ఎంతో మెచ్చుకుని, వరహాల మూటను వీరయ్య మీదికి విసిరి, "నువ్వింకా నన్ను గుర్తు పట్టినట్టులేదు! నేను చోడయ్యను. నీ ఋణం తీర్చుకునేందుకే పిలిచాను. ఈ వెయ్యి వరహాలతో సుఖంగా వుండు," అన్నాడు.

అప్పుడు వీరయ్య, కొడుకును గుర్తు పట్టి, "నాయనా! నీ కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తున్నాం. నువ్వింత గొప్ప వాడివెలా అయ్యావు?" అని అడిగాడు ఆశ్చ ర్యంగా.

"ఆరు నెలల్లో నాకు సంగీతం బాగా వచ్చింది. అటుపైన రాజాదరణ లభించింది. ఇప్పటికే నాకు రెండు కనకాభిషేకాలు జరి గాయి. పది తరాల పాటు కూర్చుని తిన్నా తరగని ఆస్తి సంపాయించాను," అన్నాడు చోడయ్య.

"నువ్వింత గొప్పవాడివైతే, మా కింక కోతి నాడించి బ్రతక వలసిన అగత్యం లేదు. ఈ విషయం తెలిస్తే మీ అమ్మ ఎంతో సంతో షిస్తుంది," అన్నాడు వీరయ్య చాలా సంతో షంగా.

చోడయ్య గంభీరంగా, "నువ్వెలా బ్రతుకు తావో నాకు అనవసరం. నువ్వు కానీ, అమ్మ కానీ ఈ ఇంటి గడప తొక్కడానికి వీల్లేదు. అమ్మను చూడాలనిపిస్తే, నేనే మీ దగ్గరకు వస్తాను. నన్ను పెంచినందుకు వెయ్యి వర హాలిచ్చి ఋణం తీర్చుకుంటున్నాను. నాకు తోచినప్పుడు మీకు ధన సహాయం చేస్తూం





టాను. మీరు మాత్రం నన్నేమీ అడగొద్దు. ఇక నువ్వేమీ మాట్లాడకు!" అని అక్కడి నుంచి వేగంగా పక్క గదిలోకి వెళ్ళి పోయాడు.

వీరయ్య ఇంటికి వెళ్ళి జరిగిందంతా భార్యకు చెప్పాడు. ఆమె కోపం పట్టలేక, "కన్నతండ్రిని అంతలేసి మాట లంటాడా? నవమాసాలూ మోసి కని పెంచిన తల్లిని తన ఇంటి గడప తొక్కవద్దంటాడా? మనం ఇప్పుడే న్యాయాధికారికి ఫిర్యాదు చేద్దాం," అన్నది.

భార్యాభర్త లిద్దరూ న్యాయస్థానానికి వెళ్ళి, న్యాయాధికారికి తమ గోడు చెప్పుకున్నారు. ఆయన వెంటనే తన మనుషుల చేత చోడయ్యకు కబురు పెట్టి రప్పించి, వాడు చెప్పిన కథంతా కూడా విన్నాడు.

అప్పుడు న్యాయాధికారి, "చోడయ్య తనకు సంగీతం నేర్పిన సంగీత విద్వాంసుడిని తండ్రిగాభావించి ఆ కుటుంబాన్ని తన దగ్గరుంచుకుని బాగాచూసుకుంటున్నాడు. అది న్యాయం. కానీ కన్న తల్లిదండ్రులకు వెయ్యి వరహాలతో ఋణం తీరిపోతుందని అతడనుకోవడం, అసందర్భంగా వుంది. అతడు వారికి తన బదులుగా ఒక కోతిపిల్లను ఇవ్వాల్సి వుంది," అని తీర్పు చెప్పాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కన్న బిడ్డలు తల్లిదండ్రుల నాదరించడం బాధ్యత కదా! తను బాగా ఆస్తిపరుడైన తర్వాత, ఆ పవిత్ర బాధ్యతను మరిచిన చోడయ్య పితృ ద్రోహికదా? పండితులే కాదు, పామరులు కూడా శిరోధార్యంగా భావించే ధర్మసూత్రాన్ని తోసి పుచ్చి, జన్మనిచ్చిన తల్లిదండ్రులకు ఋణం, ఒక్క కోతిపిల్లనివ్వడంతో తీరిపోతుందని తీర్పునిచ్చిన న్యాయాధికారి రామభద్రుడు ఎంతటి అవివేకి అయివుంటాడు! ధర్మాధర్మ విచక్షణాజ్ఞానంలేని అలాంటి వాళ్ళు, న్యాయపీఠాన్ని అలంకరించడం అవమానకరం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మనిషి కూడా ఒక జంతువే. కానీ, మెదడులో ఆలోచనా,

విచక్షణా వుండడం వల్ల అతడు జంతువుల నుంచి వేరయ్యాడు. జంతువులు పుట్టుకను బట్టి ఏంచేయాలో నిర్ణయమవుతుంది. మనిషి అలాకాక తన శక్తిసామర్థ్యాలను బట్టి ఏం చేయాలో నిర్ణయించుకుంటాడు. అందు వల్లనే కొందరు కవులవుతారు. కొందరు చిత్రకారులవుతారు. కొందరు వ్యవసాయం చేస్తారు. కొందరు రాజ్యాలేలుతారు. బిడ్డల శక్తి సామర్థ్యాలను గుర్తించి, వారిని ప్రోత్సహించిన తల్లిదండ్రులు మనుష్యధర్మం పాటించినట్లు లెక్క. వీరయ్య అలా కాకుండా కొడుకును బలవంతాన కులవృత్తిలో దింపాడు. కొడుకు ఇష్టంతో నిమిత్తం లేకుండా, తన ఇష్ట ప్రకారం వాడికి శిక్షణ నిచ్చాడు. వ్యవసాయంతో పాటు సంగీతం నేర్చుకునే అవకాశంకూడా ఇవ్వలేదు. తనకు దొరికిన కోతి పిల్లను కొట్టీ తిట్టీ ఆటా పాటా ఎలా నేర్పాడో, కొడుకునూ అలాగే పెంచాడు. అంటే ఆయన జంతు ధర్మాన్ని పాటించాడు! ఎక్కడో పుట్టిన కోతి తన ఆట పాటలతో వచ్చిన డబ్బును తల్లిదండ్రులకు కాక శిక్షకుడైన వీరయ్యకిస్తున్నది. జంతు ధర్మాన్ని పాటించే అలాంటి వారి బిడ్డలు ఫలితాన్ని వారికివ్వరు. సంగీత విద్వాంసుడు, చోడయ్య అభీష్టం ప్రకారం వాడిలోని కళను ప్రోత్సహించి గొప్పవాణ్ణి చేశాడు. కాబట్టి ఆయన మనుష్య ధర్మం పాటించిన తండ్రి అయ్యాడు. చోడయ్య ఆయనను గౌరవిస్తూ, తనూ మనిషిననిపించుకున్నాడు. అయితే చోడయ్య, తండ్రి నుంచి తప్పించుకుని వచ్చేశాడు. అందుకు బదులుగా వీరయ్యకు డబ్బు కాక మరొక కోతినివ్వడమే న్యాయం. ఎందుకంటే, వీరయ్య జంతువుకు మాత్రమే తండ్రి కాదగ్గవాడు. మరొక కోతిని ఆయన తన ఇష్ట ప్రకారం శిక్షణ నిచ్చి పెంచి డబ్బు సంపాయించగలడు. ఈ కారణాలవల్ల, న్యాయాధికారి రామభద్రుడు గొప్ప న్యాయవేత్త కాక న్యాయపీఠానికి మణిమకుటం లాంటి వాడు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]



# మహానేరం

హేలాపురికి పైరాజ్యాల వారు బంగారం తీసుకువచ్చి, అమ్మడం నిషేధించ బడింది. పైరాజ్యాల వాళ్ళు హేలాపురిలో బంగారం అమ్ముతూ పట్టుబడితే వాళ్ళకు కఠినశిక్ష పడేది.

ఒకనాడు కళింగ రాజ్యానికి చెందిన యువకుడు, నగరద్వారం ప్రవేశించబోతూ, తనిఖీ అధికారులను సమీపించి, "అయ్యా! నేను తిరిగి పైవారం వచ్చినప్పుడు నగరంలో బంగారం అమ్ముకోవచ్చునా?" అని అడిగాడు.

"ఏమాత్రం వీలవదు. అది మహానేరం!" అన్నారు తనిఖీ అధికారులు ద్వారంనుంచి ఆ యువకుడిని నగరంలోనికి పోనిస్తూ.

ఆ పైవారం ఆ యువకుడు మళ్ళీ నగరద్వారం దగ్గిరకు వచ్చినప్పుడు, తనిఖీ అధికారులు అతణ్ణి గుర్తుపట్టి, ద్వారం వద్ద నిలిపి తనిఖీ చేశారు. అతడి వద్ద బంగారమేమీ దొరకలేదు.

అప్పుడు అధికారులు, అతడితో, "పై వారం వచ్చినప్పుడు బంగారం తెచ్చి నగరంలో అమ్మజూపుతానన్నావు కదా! అందుకే ఇలా తనిఖీ చేశాం. ఏమీ అనుకోకు," అన్నారు.

దానికాయువకుడు, "ఓ౹, అదా! ఈ వారం అమ్మడానికి వీల్లేదన్నారని క్రితం వారం వచ్చినప్పుడే అమ్మేశాను బంగారం!" అన్నాడు తేలిగ్గా.

తనిఖీ అధికారులు తెల్లబోయారు.

— కోనే నాగవెంకట ఆంజనేయులు







మనదేశపు పక్షులు - జంతువులు:

# కాకి కాని కాకి!

ఒళ్ళంతా పూర్తిగా నల్లగా ఉండే పక్షులు మన దేశంలో చాలా తక్కువగా ఉన్నాయి. అలాంటి వాటిలో కాకులు ముఖ్యమైనవి. కాటుక పిట్టలు (బ్లాక్ డ్రాంగో) కూడా నల్లగానే ఉంటాయి. ఇవి కాకుల జాతికి చెందినవి కావు. కాని, నల్లగా ఉండడం వల్ల వీటిని ఆంగ్లంలో 'కింగ్‌క్రో' అని అంటారు. చిన్న పిట్టలయిన వీటికి పొడవాటి కత్తెరలా జంట తోక ఉంటుంది. ఇవి ఊరు బయటి పొలాల దగ్గర టెలిగ్రాఫ్ తీగల మీదా, స్తంభాల మీదా వుంటూ, నేల మీదికి వాలి గడ్డిలోని క్రిమికీటకాలను పట్టి తింటూ ఉంటాయి.

ఈ పిట్టలు చాలా ధైర్యమైనవి. ఒక్కొక్కసారి తమకన్నా పెద్దవైన కాకులతో కూడా పోరాడుతూ ఉంటాయి. తమ గూళ్ళ దగ్గరికి మరే పక్షులనూ రానీయవు. అంతేకాదు; తమ గూళ్ళ దగ్గరున్న ఇతర పక్షుల గూళ్ళను కూడా కాపాడుతూ వుంటాయి. కాబట్టి వీటిని 'కాపలాపిట్టలు' అని కూడా అంటారు. ఉత్తర భారతదేశంలో వీటిని 'భీమ్‌రాజ్' పక్షులు అని అంటారు.

మన దేశంలో ఎనిమిది రకాల కాటుక పిట్టలున్నాయి. పొడవాటి తోక గల పిట్టలకు నుదుటి మీద కుచ్చు ఉంటుంది. తోక కొసలో విడిపోయిన తీగ వంటి జత కుచ్చులు ఉంటాయి. కొన్ని పిట్టలకు పొట్ట అడుగున తెల్లగానూ, మరికొన్నిటికి బూడిద రంగు పొట్టా ఉంటుంది. కొన్ని పిట్టల కళ్ళు కెంపుల్లా ఎర్రగా మెరుస్తూ ఉంటాయి.




# శోభాసింగ్



నేలమీద కూర్చుని దీక్షగా ఏవో గీతలు గీసుకుంటూన్న ఒక కుర్రవాణ్ణి, ఆ ఇంటికి వచ్చిన బంధువు, "ఏం బాబూ! నువ్వు పెద్దవాడయ్యాక, మీ నాన్నలాగే సైన్యంలో చేరుతావు కదూ?" అని అడిగాడు.

ఆ కుర్రవాడు కాదు అన్నట్టు తల అడ్డంగా ఊపాడు. "మరి, ఏం చేస్తావు?" అని అడిగాడు బంధువు.

నేల మీద గీసిన బొమ్మలను చూపాడు కుర్రవాడు.

"ఇలా బొమ్మలు గీస్తూ కూర్చుంటే, మరి తిండికేం చేస్తావు?" అని అడిగాడు బంధువు.

ఇంటి లోపల పనులు చేసుకుంటూన్న అక్కయ్యను చూపాడు కుర్రవాడు.

పంజాబుకు చెందిన సుప్రసిద్ధ చిత్రకారుడు శోభాసింగ్ బాల్యంలో జరిగిన సంఘటన ఇది.



శోభాకు ఐదేళ్ళ ప్రాయంలోనే తల్లి పోయింది. మిలిటరీలో సర్వేయర్‌గా పని చేస్తున్న అతని తండ్రికి కొడుకును గురించి పట్టించుకునే తీరిక ఉండేది కాదు. అందు వల్ల శోభా, ఆలనాపాలనా అతని అక్కయ్య, బీబీ లక్ష్మీదేవి, ఆమె భర్త సర్దార్ మంగళ్ సింగ్ చూసుకునే వాళ్ళు. పంజాబు రాష్ట్రంలోని హర్‌గోవిందపూర్‌లో 1901వ సం॥లో శోభాసింగ్ జన్మించాడు. పసిప్రాయంలోనే తల్లి తండ్రులు పోయారు. ఐదవ తరగతి వరకు చదువు సాగింది. ఆ తరవాత సైన్యంలో జూనియర్ డ్రాఫ్ట్‌మేన్‌గా పనిచేయడానికి శిక్షణ పొందాడు. శోభా, మరి కొందరు సైనికులతో కలిసి ఇరాక్ వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు సహోద్యోగుల సహాయంతో ఇంగ్లీషు నేర్చుకున్నాడు. అంతేకాదు; అక్కడ సుప్రసిద్ధ పాశ్చాత్య చిత్రకారులు చిత్రించిన బొమ్మలు గల పుస్తకాలు కొన్నిటిని చూడ డంతో, అతనిలోని చిత్రకళాభిరుచి మళ్ళీ చివురించి బలపడసాగింది.

1923వ సం॥లో మన దేశానికి తిరిగి వచ్చాడు. అప్పుడే పెళ్ళయింది. చిత్ర కారుడిగా స్థిరపడాలన్న ఉద్దేశంతో మిలిటరీ ఉద్యోగానికి రాజీనామా చేసి, లాహో ర్‌లో ఒక స్టూడియో ఏర్పాటు చేసుకున్నాడు. జీవితంలో ఎన్నో కష్టనష్టాలను ఎదు ర్కొని ధైర్యంగా పోరాడిన శిక్కు గురువుల చిత్రాలను గీయడం మొదలు పెట్టాడు. ప్రేమ,

సాహసం నిండిన పంజాబీ కథలు కూడా అయన చిత్ర రచనకు ప్రేరణ నిచ్చాయి.

కొన్నాళ్ళ తరవాత అయన లాహోర్ నుంచి ఢిల్లీకి మకాం మార్చాడు. 1942వ సం॥లో అక్కడి నుంచి, 'ప్రీత్‌లహరి' అనే పంజాబీ పత్రిక సంపాదకుడు గురుబక్స్ సింగ్, అమృత్‌సర్ - లాహోర్‌లకు మధ్య రూపొందించిన 'ప్రీత్‌నగర్' అనే ఆదర్శ గ్రామానికి చేరాడు. అయినా, అతడు అట్టే కాలం అక్కడ ఉండలేక మళ్ళీ లాహోర్ చేరాడు.

1947వ సం॥లో భారత పాకిస్తాన్ విభజన జరిగినప్పుడు, శోభాసింగ్ లాహోర్‌లో తన అపూర్వమైన చిత్రాలతో పాటు సర్వస్వాన్ని వదిలి పెట్టి రావలసివచ్చింది. అయన





హిమాచల్ ప్రదేశ్‌లోని కాంగ్రా లోయలో స్థిరపడి నూతన ఉత్సాహంతో చిత్రాలు గీయడం మొదలుపెట్టాడు. అప్పటికే అయన మంచి చిత్రకారుడుగా పేరుప్రఖ్యాతులు సంపాయించుకున్నాడు.

శోభాసింగ్ 1986వ సం॥ ఆగస్టు 21వ తేదీ కాలధర్మం చెందాడు. చిత్రకళలో ఎటువంటి శిక్షణ లేకుండానే అయన స్వయంకృషితో గొప్ప చిత్రకారుడుగా మన్ననలు పొందాడు. అందుకే ఆయనను 'సహజ చిత్రకారుడు' అని చెబుతారు. అయన గీసిన చిత్రాలలో గురునానక్, ఇతర శిక్ఖు గురువుల చిత్రాలూ; కృష్ణుడు, రాముడు మొదలైన దేవతామూర్తుల చిత్రపటాలూ అభిమానుల విశేష ఆదరణ పొందాయి.

# మీకు తెలుసా?

1. జీవిస్తున్న పక్షులలోకెల్లా చాలా పెద్దది ఏది?
2. 'భారతీయ రాజ్యాంగం' ఎప్పుడు అమలులోకి వచ్చింది?
3. ఐదుభాషలు అంతర్జాతీయ భాషలుగా గుర్తింపు పొందాయి. అవి ఏవి?
4. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి, రాజ్యసభ అధ్యక్షుడు, లోక్‌సభ స్పీకర్ వీరిలో మనదేశంలో అసలైన కార్యనిర్వహణాధికారి ఎవరు?
5. సముద్రాలలోకెల్లా చాలా పెద్దది ఏది? రెండవది ఏది?
6. 'వందేమాతరం,' 'జనగణమన' వీటిమధ్య ఉన్న తేడా ఏమిటి?
7. సాహిత్యం కోసం ప్రప్రథమంగా నోబెల్ బహుమతి పొందిన వారెవరు?
8. మనదేశంలో ఏ భాషలో ఎక్కువ పత్రికలు వెలువడుతున్నాయి?
9. 'అర్ధరాత్రిసూర్యుడి భూమి' అని ఏ దేశాన్ని అంటారు?
10. మన సంగీత వాద్యాలలో అతి ప్రాచీనమైనది ఏది?
11. ఒలింపిక్ క్రీడలు ఎన్నాళ్ళకొకసారి జరుగుతాయి?
12. మనదేశంలో బానిసవంశ స్థాపకుడు ఎవరు? ఆయన ఎవరివద్ద బానిసగా ఉన్నాడు?
13. ప్రపంచంలోకెల్లా చాలా వెడల్పయిన జలపాతం ఏది?
14. మనదేశంలో మొట్టమొదటి కథాచిత్రాన్ని ఎవరు ఎప్పుడు నిర్మించారు? చిత్రం పేరేమిటి?
15. 'థాయ్‌లాండ్' పూర్వనామం ఏమిటి?
16. బుద్ధుడు ఎప్పుడు నిర్యాణం చెందాడు?
17. ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద విమానదళం ఏది?

# సమాధానాలు

1. నిప్పుకోడి.
2. 1950, జనవరి 26.
3. ఇంగ్లీష్, ఫ్రెంచ్, స్పానిష్, ఇటాలియన్, రష్యన్.
4. ప్రధానమంత్రి.
5. పసిఫిక్ మహాసముద్రం. అట్లాంటిక్ సముద్రం.
6. మొదటిది మన జాతీయ ప్రార్థనాగీతం. రెండవది జాతీయ గీతం.
7. ఆర్.ఎఫ్.ఏ. సల్లీ - ప్రథోమ్.
8. హిందీ. మూడువేలకు పైగా.
9. నార్వే.
10. వీణ.
11. నాలుగేళ్ళకొకసారి.
12. కుతుబుద్దీన్; ఘోరీ మహమ్మద్.
13. లావోస్‌లోని ఖోనే జలపాతం. 10,800 మీటర్ల వెడల్పు.
14. దాదాసాహెబ్ ఫాల్కే. 1913. రాజా హరిశ్చంద్ర.
15. సయామ్.
16. క్రీ.పూ. 488.
17. సౌదీ అరేబియా రియాధ్‌లోని కింగ్ ఖలీద్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్.




# పుణ్యాత్ముడు

శివయ్య అనే అతడికి ఉన్నట్లుండి డబ్బు అవసరమయింది. ఎరిగిన వాళ్ళను ఎవర్న డిగినా లేదన్నారు. చివరకు తన బంధువైన కేశవులి నడిగాడు. ఆయన మహాపిసినారి అని పేరు.

కేశవులు, శివయ్యతో, "చూస్తూ చూస్తూ నీవంటి వాడికి అప్పెవరిస్తారు? ఇచ్చిన డబ్బు తిరిగి ఎలా వస్తుంది? నా మాట విని శ్రీపురం వెళ్ళు. అక్కడ గుణాఢ్యుడనే ఒక పుణ్యాత్ముడున్నాడు. ఆయన ఎలాంటి వారి కైనా కనికరించి అప్పులిస్తాడు. ఆ డబ్బుతో నీ దశ కూడా తిరిగిపోయి బాగుపడొచ్చు," అన్నాడు.

శివయ్య శ్రీపురం వెళ్ళి గుణాఢ్యుడిని కలుసుకున్నాడు. ఆయన అతడి వివరాలన్నీ విని, మరికొన్ని ప్రశ్నలు వేసి, "అవసరాల కంటూ అప్పులు చేయడం అలవాటైతే, నువ్విలాగే ఎదుగూ బొదుగూ లేకుండా వుండి పోతావు. నీలో వ్యాపారానికి పని కొచ్చే తెలివి వుందని నీ సమాధానాలను బట్టి అర్థమవుతున్నది. నీకు వెయ్యి వరహాలి స్తాను. దాంతో వ్యాపారం ప్రారంభించు. ఏడాది తర్వాత మంచి లాభాలొస్తే నాకు రెండు వేల వరహాలు తిరిగివ్వాలి. తిరిగివ్వడానికి రెండేళ్ళు పడితే నాలుగు వేల వరహాలివ్వాలి. అలా ఏటా రెట్టింపు చేస్తూ వెళ్ళాలి. అందుకు ఇష్ట మేనా?" అన్నాడు.

చూస్తూచూస్తూ తనకు వెయ్యి వరహాలిచ్చే వాళ్ళెవరు? అందువల్ల, గుణాఢ్యుడి షరతుల న్నింటికీ అంగీకరించాడు శివయ్య. ఆయన ఆ ప్రకారం శివయ్య చేత పత్రం రాయించు కుని, సంతకం చేయించుకుని డబ్బిచ్చి పంపే శాడు.

గుణాఢ్యుడి డబ్బులో ఏమి మహిమవుందో కానీ, సంవత్సరం తిరక్కుండా తన తిండి ఖర్చులు పోను అయిదు వేల వరహాలు పోగు

"వసుంధర"



చేశాడు శివయ్య. అందులో రెండు వేలు గుణాఢ్యుడి కిద్దామని అతననుకునే లోగా ఒక వ్యాపారి వచ్చి, "నీ దగ్గిర అయిదు వేలుంటే నాతో చేతులు కలుపు. ఏడాది తిరక్కుండా యాభైవేలు సంపాదించే వ్యాపార మొక టుంది," అన్నాడు.

అప్పుడు శివయ్య ఆలోచించాడు. గుణాఢ్యుడికి రెండు వేలూ ఇచ్చేస్తే, తనకీ వ్యాపారంలో దొరికే పెద్దలాభం పోతుంది. యాభై వేలు సంపాదిస్తే, అందులోంచి నాలుగు వేలా యనకివ్వడం సులభం!

శివయ్య తను కొత్తగా ప్రారంభించనున్న వ్యాపారంలో అయిదువేలు పెట్టుబడి పెట్ట మన్న వ్యాపారితో కలిశాడు. ఈ వ్యాపారంలో గుణాఢ్యుడి వద్ద పెరిగే అప్పుకంటే వేగంగా శివయ్య డబ్బు పెరగ సాగింది. ఇందువల్ల, అతడు గుణాఢ్యుడి అప్పు తీర్చడానికి వాయిదా వేస్తూ వచ్చాడు.

అలా అయిదేళ్ళు గడిచే సరికి, శివయ్య లక్షలకు లక్షలు గడించాడు. గుణాఢ్యుడికి అతడి బాకీ ముప్పై రెండు వేల వరహాలకు పెరిగింది. ఇప్పుడు ఒక్కసారిగా అంత మొత్తం బాకీ తీర్చాలంటే శివయ్యకు మనసొప్పడం లేదు.

"వెయ్యి వరహాలకు అయిదేళ్ళలో ముప్పై రెండు వేల వరహాలివ్వమని అడిగేవాడు పుణ్యాత్ముడెలా అవుతాడు? నిజానికి సాయం పేరు చెప్పి పేదవాళ్ళను దోపిడీ చేసే బంది పోటు గుణాఢ్యుడు!" అనుకుని ఊరుకున్నాడు శివయ్య.

గుణాఢ్యుడి కూతురుకు పెళ్ళి కుదిరింది. నగలు కొనడానికి ఆయన శివయ్య దుకాణానికే వచ్చాడు. నాలుగు వేల వరహాలకు ఒక నగను ఎంపిక చేసి ఆయన డబ్బివ్వబోగా వెంట తెచ్చిన డబ్బులో వెయ్యి వరహాలు తక్కువయ్యాయి. పరిస్థితి గమనించి శివయ్య ముఖం చాటేశాడు. అయితే, పనివాడితో మాత్రం గుణాఢ్యుడిని మర్యాదగా చూడమనీ, డబ్బుతో నిమిత్తం లేకుండా నగను ఆయనకు ఇచ్చేయమనీ చెప్పాడు.

పనివాడు గుణాఢ్యుడితో, "అయ్యా! మా అయ్యగారు హఠాత్తుగా పని తగిలి బయటకు

వెళ్ళారు. ఈ నగ తమదిగా భావించండి. తోచిన డబ్బిచ్చి వెళ్ళండి. ఇది అయ్యగారి ఆజ్ఞ నాకు!" అన్నాడు.

గుణాఢ్యుడు తటపటాయిస్తూ, "తెచ్చిన డబ్బంతా ఖర్చయింది. నాకింకా అవతల చాలా ఖర్చులున్నాయి. నగకు గాను ఇంకా ఇవ్వవలసిన వెయ్యివరహాలూ చెల్లించడా నికి, నాకింకా నాలుగైదు రోజులు గడువు కావాలి!" అన్నాడు.

"అయ్యా! దానిదేముంది. మీ ఇష్ట ప్రకా రమే చెయ్యండి. అయినా అయ్యగారూ తమకు బాకీ వున్నారట కదా," అన్నాడు పని వాడు వినయంగా.

"అది వేరు. దానికి నేను వడ్డీ తీసుకుం టాను. అదెంత ఆలస్యమైతే అంత లాభం నాకు. దీనికి నేను వడ్డీ ఇవ్వను," అన్నాడు గుణాఢ్యుడు.

పనివాడన్నింటికీ అంగీకరించి, ఆయన వద్ద మూడు వేల వరహాలు తీసుకుని నగ ఇచ్చి పంపాడు. తర్వాత శివయ్య వచ్చాక జరిగింది చెప్పాడు.

అది విన్న శివయ్య, "ఈ గుణాఢ్యుడు తన బాకీలో అసలు రాబట్టుకునేందుకు వచ్చాడన్నమాట. అంతా నాటకం. అంత మొత్తంలోనూ సరిగ్గా వెయ్యి వరహాలే తక్కువ కావాలా?" అనుకున్నాడు.

ఇది జరిగిన రెండు రోజులకు అనుకో కుండా పెద్ద జబ్బు చేసి గుణాఢ్యుడు మర ణించాడు. అది తెలిసి శివయ్య మనసులో ఎంతగానో సంతోషించి, "ఆయనకు డబ్బు





ఇంతలో గుణాఢ్యుడి పెద్ద కొడుకు, "మా నాన్నగారు ఎందరికో సాయం చేశారు. కొందరికి అప్పులిచ్చారు. ఈ డబ్బు వ్యవహారాలన్నీ ఒక పుస్తకంలో రాసి వుంచారుట. అందులోనే ఆయనవీలునామాకూడా వుంది. అది కనిపించడం లేదు. దానికోసం వెతుకుతున్నాను," అన్నాడు.

అప్పుడు శ్రీపురం గ్రామాధికారి, "ఆ పుస్తకం, వీలునామా ఆయన తన ఇనప్పెట్టెకున్న రహస్యపుటరలో దాస్తాడని నాకు తెలుసు. నీకు దాన్ని చూపిస్తాను!" అని, ఆ రోజు మంచిరోజు కాదు కాబట్టి, ఆ అరను తెరిచి పుస్తకం తీయడాన్ని మర్నాటి వరకూ వాయిదా వేయమని సలహా యిచ్చి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

తిరిగి ఇవ్వలేదన్న బాధ లేకుండా, వెయ్యి వరహాలూ మొన్ననే ఇచ్చెయ్యడం జరిగిపోయింది. అంతే ఇవ్వడం న్యాయంకూడా!" అనుకున్నాడు.

గుణాఢ్యుడికి కర్మ చేసి, సంతర్పణకు చుట్టుపక్కల ఊళ్ళలోని ప్రముఖులందరికీ కబురు పంపాడాయన పెద్దకొడుకు. శివయ్య కూడా వెళ్ళాడు. అక్కడ అంతా ఆయన నిస్వార్థపరుడనీ, మహాపుణ్యాత్ముడనీ, అందువల్లనే అంత త్వరగా అనాయాసంగా మరణించాడనీ చెప్పుకుంటూంటే, శివయ్య లోలోపల నవ్వుకుని, "ధనాశతో అప్పులిచ్చి అసహాయులనుంచి పెద్ద వడ్డీలు గుంజేవాడి గురించి జనంఎలాచెప్పుకుంటున్నారో!"అనుకున్నాడు.

ఇది వింటూనే శివయ్యకు గుండెల్లో రాయి పడింది. ఆ పుస్తకం బయట పడితే చాలా డబ్బు గుణాఢ్యుడి కుటుంబానికి గుమ్మరించాల్సి వస్తుంది.

శివయ్యే కాదు, అలాంటి వాళ్ళింకా నలుగురు వ్యాపారులున్నారక్కడ. వారిలో ఒకడు గుణాఢ్యుడికి దాదాపు లక్ష వరహాల పైగా బాకీ వున్నాడు.

ఈ అయిదుగురు వ్యాపారులూ కలిసి పథకం వేసి, ఒక మనిషిని నియమించి గుణాఢ్యుడింటికి పంపారు. వాడు రాత్రికి రాత్రి వెళ్ళి, గుణాఢ్యుడి పెద్ద కొడుకును కత్తి చూపి బెదిరించి ఇనప్పెట్టెలోని రహస్య

పుటరలోంచి గుణాఢ్యుడి లెక్కల పుస్తకాన్ని తీయించాడు. తర్వాత దాన్ని శివయ్యకూ, అతడి స్నేహితులకూ అందజేసి, వాళ్ళిచ్చిన బహుమతిని పుచ్చుకుని సంతోషంగా వెళ్ళి పోయాడు.

ఆ పుస్తకాన్ని తగులబెట్టాలని, ఆ అయిదుగురూ అనుకున్నారు. కానీ తమ బాకీల గురించి ఆయన ఏమి రాశాడో తెలుసుకుందామన్న కుతూహలంతో దాన్ని తెరిచారు. అందులో ఇలావుంది:

"నేను సామాన్యులకు అప్పు పేరు చెప్పి డబ్బిస్తూంటాను. దానంగా అంటే, అవసరం వున్నా లేకపోయినా అంతా డబ్బు కోసం ఎగబడతారని నా భయం. డబ్బుతో పాటు వారివారికి తగిన సలహాలు కూడా ఇస్తాను. నా డబ్బు, నే నిచ్చిన సలహాలతో చాలా మంది బాగుపడ్డారు. వాళ్ళు డబ్బు నాకు తిరిగిస్తే, దాన్నిలాంటి పుణ్యకార్యాలకే వినియోగిస్తాను. అందులో నుంచి సొంతానికి దమ్మిడీ వాడను. వాళ్ళివ్వక పోతే వూరుకుంటాను. వాళ్ళ చేత రాయించుకున్న ఆ పత్రాలు వాళ్ళు వెళ్ళగానే చించి పారేస్తాను. నా పెద్ద కొడుకు కూడా ఇదే పద్ధతిలో నాలాగే జీవితం గడిపితే నాకెంతో సంతోషంగా వుంటుంది."

ఇది చదివి వ్యాపారులైదుగురూ తెల్లబోయారు.

ఆ పుస్తకంలో ఆ తర్వాత ఆయన తీర్చవలసిన బాకీల వివరాలున్నాయి. అందులో ఆఖరున శివయ్యకు వెయ్యి వరహాలు బాకీ వున్నట్లుంది. ఇది రాశాకే ఆయన చనిపోయాడు.

గుణాఢ్యుడిని అంతా పుణ్యాత్ముడని ఎందుకంటారో శివయ్యకూ, అతడి స్నేహితులకూ అప్పుడర్థమయింది. వాళ్ళా పుస్తకాన్ని మళ్ళీ రహస్యంగా గుణాఢ్యుడింటికి చేర్పించారు. తామెంతెంత బాకీ వున్నదీ కచ్చితంగా లెక్క కట్టి, గుణాఢ్యుడి పెద్ద కొడుక్కు బాకీలు తీర్చేశారు.

ఆ తర్వాత గుణాఢ్యుడి పెద్ద కొడుకుతో పాటు శివయ్య కూడా ఆయన అడుగు జాడల్లో నడిచాడు.





# మరుగుజ్జు పెళ్ళి

పూర్వం పొట్టిలంక అనే గ్రామంలో, చుక్కడనే మరుగుజ్జు వుండేవాడు. వాడు అతి పొట్టిగా వికారంగా కనిపించేవాడు. అయినా, వాడె లాంటి అడవి ఏనుగునైనాసరే మచ్చిక చేసి, మహారాజు గారి గజశాలకు ఏనుగులమ్మే వ్యాపారులకు సాయం చేసేవాడు.

దేశాన్నేలే మహారాజు ఒకసారి స్వయంగా వాడి నేర్పు చూసి చాలా సంతోషించి, "ఒక మారుమూల కుగ్రామమైన పొట్టిలంకలో పుట్టిన నువ్వు, నాదేశ పౌరుడివైనందుకు గర్విస్తున్నాను. శాపగ్రస్తుడైన నలమహారాజులాగా, నువ్వు కారణజన్ముడివై వుండాలి! నువ్వు అన్ని విధాలా నా ఆస్థానంలో వుండవలసిన వాడివి. నా గజశాలను పర్యవేక్షించే ప్రధానాధికారిగా నిన్ను నియమిస్తున్నాను," అన్నాడు.

అంతే! మరుగుజ్జు చుక్కడు మహారాజు గారి గజశాల ప్రధానాధికారి అయిపోయాడు. ఇప్పుడు చుక్కడికి ఏలోటూ లేదు. భయభక్తులతో మెలిగే ఉద్యోగులు వాడి చేతికింద చాలామంది వున్నారు. అయినా వాడు తన ఆకారంగురించి న్యూనత పడడం మానలేదు.

మహారాజు, వాడెప్పుడూ మందకొడిగానూ, నిరుత్సాహంగానూ వుండడం గమనించి, "నీకు కొలువులో మంచి ఉద్యోగం వుంది. ఏనుగులను మచ్చిక చేయడంలో నీకున్న నేర్పు చూసి, ప్రజలందరూ అబ్బురపడిపోతున్నారు. అయినా, నీవు చలాకీగా, సంతోషంగా వుండడం లేదంటే, బహుశా నీకొక తోడు అవసరం అని నేను భావిస్తున్నాను. త్వరగా పెళ్ళి చేసుకో!" అని చెప్పాడు.

చుక్కడు బలవంతాన నవ్వు తెచ్చుకుని, "మహారాజా! తమ ఔదార్యం వల్ల, నా నేర్పుకు తగ్గ ఉద్యోగం సంపాయించుకోగలిగాను," అనిక్షణం ఆగి, "క్షమించాలి, మహారాజా! పెళ్ళి చేసుకోమనడంలో తమరు నన్ను హేళన చేస్తున్నారని అనే సాహసం, నాకు లేదు," అన్నాడు.

జె. ఉదయనాగశిరీష

చుక్కడి మాటలకు రాజు నొచ్చుకుని, "నేనన్నదాంట్లో అవహేళన ఏమీలేదు. ప్రతి జీవికీ తనకంటూ ఒకతోడు అవసరం. నీకు ఒకచక్కటికన్యతో పెళ్ళిచేయిస్తాను," అన్నాడు.

మరుగుజ్జుచుక్కడు, రాజుకు నమస్కారం చేసి మౌనంగా వూరుకున్నాడు.

ఇప్పుడు చుక్కడి పెళ్ళి గురించి మహారాజు ఆలోచనలో పడ్డాడు. నిజానికి వాడి ఆకారం చూసి పెళ్ళి చేసుకునే అమ్మాయికి గొప్ప త్యాగబుద్ధి వుండాలి. రాజు బాగా యోచించి, చివరకు ఒక చాటింపు వేయించాడు: చుక్కణ్ణి పెళ్ళి చేసుకునేందుకు ఒప్పుకునే అమ్మాయి తండ్రికి, రాజు అతడు కోరుకున్న చోట సుక్షేత్రమైన మాగాణి, భవంతి, భత్యము ఇస్తాడు.

చాటింపు విని, పెళ్ళి కావలసిన ఆడపిల్లల తల్లిదండ్రులు చాలామంది, చుక్కడు అల్లుడవడం వల్ల పట్టబోయే మహాయోగానికి ఆశపడి ఆత్మవంచనచేసుకోబోయారు కాని, కూతుళ్ళు ఒప్పుకోనందున కొందరూ, సాటి బంధువుల ఈ సడింపుల వల్ల కొందరూ, ఆ ప్రయత్నం మానుకున్నారు.

చిట్టచివరకు రాజుగారి పరిశీలనకు ముగ్గురమ్మాయిలు వచ్చారు. అందులో ఇద్దరు సాధారణమైన అందగత్తెలు. మూడోది చుక్కడిలాగే మరుగుజ్జు.

రాజు ముగ్గురినీ విడివిడిగా పిలిచి, "రాజు నన్న జంకూకొంకూ లేకుండా నిర్భయంగా, మీ అభిప్రాయాలు చెప్పండి!" అన్నాడు.



ఇందుకు మొదటి అమ్మాయి, "మహారాజా! నన్ను, నా సవతితల్లి రాచి రంపాన పెడుతున్నది. మా నాన్న ఆమె పట్ల దాసానుదాసుడుగా ప్రవర్తిస్తాడు. ఆమె నన్ను ఒక ముసలివాడికిచ్చి పెళ్ళి చేయాలని ప్రయత్నిస్తున్నది. ఇలాంటి సమయంలో మీ చాటింపు ఆమెకు వరంలా తోచింది. ఏమైనా, నేను రాజాజ్ఞ పాటించడానికి సిద్ధంగా వున్నాను," అన్నది.

"ఒకవేళ నేను, నీకు చక్కటి వరుణ్ణి చూస్తే, ఈ మరుగుజ్జును వదిలేస్తావా?" అని అడిగాడు రాజు.

"నేను రాజాజ్ఞ పాటించడానికి సిద్ధంగా వున్నాను!" అన్నదా అమ్మాయి విరక్తిగా.

ఇక రెండో అమ్మాయి తండ్రి చాలా పేద వాడు. ఈ అమ్మాయి తర్వాత పెళ్ళి కావలసిన ఇంకా ఇద్దరాడపిల్లలున్నారు. ఆ అమ్మాయి తను మరుగుజ్జును పెళ్ళాడడం వల్ల, తన కుటుంబ సభ్యులు ఎక్కువ సుఖపడతారన్న భావాన్ని వ్యక్తం చేస్తూ; రాజు తన తండ్రికి ఇంకా ఎక్కువ కానుక లివ్వాలని కోరింది.

రాజు, మరుగుజ్జు అమ్మాయితో, "నేను తలచుకుంటే ఏమైనా చెయ్యగలను! చుక్కడికి అందమైన అమ్మాయినిచ్చి పెళ్ళి చేసినట్లే, నీకు స్వయంవరం ఏర్పాటు చేసి, రాజ్యంలోని అందమైన యువకులందరినీ రావలసిందిగా శాసించి, వాళ్ళల్లో నువ్వు కోరిన యువకుడితో రంగరంగ వైభోగంగా పెళ్ళి జరిపిస్తాను. నువ్వు చుక్కడిలాంటి మరుగుజ్జును పెళ్ళి చేసుకోవడం, నాకిష్టంలేదు. చక్కని రూపం ముందు మంచితనం, తెలివితేటలూ, నేర్పరితనం లాంటవి గుడ్డిగవ్వ విలువ చెయ్యవని, నీకు తెలిసిందే గదా!" అన్నాడు.

మరుగుజ్జు అమ్మాయి వంగి తన పొట్టి చేతులతో రాజుకు నమస్కారం చేసి, "మహారాజా! రాజాజ్ఞతో నాకు నవమన్మథుడిలాంటి యువకుడితో పెళ్ళి జరిపించగలరు. కానీ మనసుల్నికలపలేరు. నేనుచుక్కయ్యహోదాకు తగిన భార్యను కాక పోయినా, ఆయన మనసెరిగి ప్రవర్తించగలదాన్ని!" అన్నది.

రాజు, మరుగుజ్జు అమ్మాయి మాటలకు చాలా సంతోషించాడు. ఆయన మర్నాడు చుక్కడిని పిలిచి, "నీ హోదా చాటున నీ మరుగుజ్జు తనాన్ని మరిచి పోదామని ప్రయత్నించే అమ్మాయి కన్న, నీ మనసెరిగి ప్రవర్తించే మరుగుజ్జు అమ్మాయినే, నీతో పెళ్ళికి ఎంపిక చేద్దామనుకుంటున్నాను. కాదంటే - మిగిలిన ఇద్దరమ్మాయిలలో, ఒకమ్మాయిని నువ్వు కోరుకోవచ్చు!" అన్నాడు.

మరుగుజ్జుచుక్కడు తటపటాయించకుండా, మరుగుజ్జు అమ్మాయినే కోరుకున్నాడు. రాజు వాళ్ళిద్దరికీ పెళ్ళి జరిపించాడు.

తర్వాత ఆయన, దుర్భర పరిస్థితుల కారణంగా, మరుగుజ్జును చేసుకునేందుకు వచ్చిన ఇద్దరమ్మాయిలకూ తగిన వరులను చూసి ఘనంగా పెళ్ళిళ్ళు చేశాడు.





# వీరహనుమాన్

అంజనాదేవి చేసిన ఘనమైన అతిథి సత్కారాలు పొంది, విందు ఆరగించిన తరవాత, రాముడితో వచ్చిన వారందరూ తిరిగి అయోధ్యకు వెళుతున్నారు.

దారిలో సీత, యశోధరతో, "చూశావా! నేను ముందే చెప్పానుగదా! నీ భర్తకు ఎటువంటి భయమూ ఉండదని. హనుమంతుడి శరణు పొందిన యయాతి చరితార్థుడైనాడు!" అని అన్నది.

దానికి యశోధర కృతజ్ఞతతో సీతను చూస్తూ, "అంతా, మీ సీతారాముల అనుగ్రహమే కదమ్మా! హనుమంతుని హృదయంలో రామునితోబాటు నీవు కూడా మాకందరికీ కనిపించావు, మా కన్నులు ధన్యమైనాయి!" అన్నది.

"ఔను, సీతమ్మా, మేమూ చూశాము!" అంటూ ఆనందోత్సాహాలతో చంద్రాంగదుడూ, చంద్రముఖీ కూడబలుకుతూ చప్పట్లు చరిచారు. యశోధర వారిని ఉష్ అని వారించి, తన పిల్లలను మమతగా చూస్తూన్న సీత ముఖాన్ని చూసి, "అమ్మా! త్వరలో నీవు సంతానవతివి అవుతావు? నీ ముఖంలో మాతృకళ దివ్యంగా కనిపిస్తున్నది," అన్నది.

సీత సిగ్గుపడుతూ, చిన్నగా నవ్వుతూ యశోధరతో, "వయసులో పిన్నదానివిగా కనిపిస్తున్నా, ఇలాంటి రత్నాలవంటి పిల్లల్ని కన్నందుకు నా కంటే నీవు గొప్ప దానివి; అదృష్టవంతురాలవు. నీ మాటలు ఆశీర్వాదాలుగా భావిస్తున్నాను!" అన్నది.

42. అశ్వమేధయాగము



ఆ విధంగా పల్లకిలో వాళ్ళు ముచ్చటించుకుంటూండగా అయోధ్యకు చేరారు. యయాతి సకుటుంబంగా రాముడి అతిథిగా ఉన్నాడు. సీత యశోధరతో సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ, ఆమె పిల్లలతో ఆట పాటలతో ముచ్చట తీర్చుకున్నది. పిల్లలిద్దరూ 'అమ్మా! అమ్మా!' అంటూ చుట్టుకొని తిరుగుతూ ఉంటే ఆమె ఆనంద తన్మయురాలైంది.

కొన్నాళ్ళ తర్వాత యయాతి సీతారాముల వద్ద శలవు తీసుకొని భార్యా, బిడ్డలతో తన రాజ్యానికి వెళ్లాడు.

ఒక పూర్ణిమనాటి సాయంకాలం సీతతో రాముడు అంతఃపురోద్యానవనంలో విహరిస్తున్నాడు. అప్పుడే చంద్రోదయమవుతున్నది. రాముడు సీతతో, "జానకీ! అటు చూడు!" అని చూపించాడు.

సీత, "తూర్పుదిశ అనే కౌసల్యాదేవికి రామచంద్రుడు ఉదయిస్తున్నాడు!" అని అన్నది.

రాముడు, "కాదు, సీతాదేవికి అటువంటి చంద్రోదయమే త్వరలో అవుతుంది, అని తూర్పుదిక్కు మనకు జోస్యం చెబుతోంది," అన్నాడు.

"ఆ చంద్రుడు రామచంద్రుడి లాగే ఉంటాడని కూడా చెబుతున్నది కదూ?" అన్నది సీత.

"ఆ చంద్రుడు జానకీదేవిని పోలి ఉంటాడని అంటున్నది!" అన్నాడు రాముడు మందహాసంతో.

ఇద్దరూ ఆనందంగా నవ్వుకున్నారు. వారు కూర్చున్న చంద్రశిలా వేదిక దాపునే ఉన్న చిన్న కొలనులో రెండు కలువలు జంటగా వికసిస్తున్నవి. చూడముచ్చటగా ఉన్న వాటిని కొంతసేపు పదేపదే చూస్తూ గడిపి సీత అక్కడి నుంచి లేచి రాముడితో అంతఃపురంలోకి వెళ్ళింది.

కొంత రాత్రి గడిచాక సీత ఒకసారి ఇవతలకు వచ్చి మేడ మీద నుంచి ఉద్యానవనం కలయజూసింది. పున్నమి వెన్నెల నిండుగా ఉన్నది. దాపున ఉన్న ఆ చిన్న కొలనులో

వెన్నెల మిలమిలా మెరుస్తున్నది. ఆ ప్రశాంత వాతావరణంలో అందమైన కలువలు రెండూ తెల్లగా నక్షత్రాల్లా మెరుస్తూ కనిపించాయి సీతకు.

•••••



గంధమాదన పర్వతం మీద హనుమంతుడు జపతపాలతో గడుపుతూండగా, ఎంతకాలమైందో తెలీకుండానే చాలా ఏళ్ళు దొర్లిపోయినై. ఒకనాడు అయోధ్య నుంచి రాముడి ఆప్త అంతరంగికుడూ, వయోవృద్ధుడూ అయిన భద్రుడు వచ్చి, "రాముడు నిన్ను రమ్మంటున్నాడు!" అని హనుమంతుడికి చెప్పాడు.

భద్రుడు చాలా విచారంగా కనిపించాడు. "ఏమి జరిగింది? అయోధ్యలో జరిగిన విశేషాలేమిటి?" అని హనుమంతుడు అతన్ని అడిగాడు.

భద్రుడు పెద్దగా నిట్టూర్చి, "అంతా జరిగిపోయింది...." అన్నాడు.

"ఏమిటి నీవంటున్నది? వివరంగా చెప్పు!" అన్నాడు హనుమంతుడు.

"క్లుప్తంగా చెబుతాను విను!" అంటూ భద్రుడు జరిగినది ఇలాగ చెప్పాడు:

ఒకనాడు ఋషులను కూడా వెంటబెట్టుకుని బ్రాహ్మణుల గుంపొకటి, రాముడి దగ్గిరికి వచ్చింది. శంబుకుడు అనే శూద్రుడు వేదాధ్యయనం చేసి తపస్సు చేస్తూన్న కారణంగా ధర్మహాని కలిగిందనీ, అందువల్ల తమ బాలుడొకడు హఠాత్తుగా అకాలమరణం పొందాడనీ, వెంటనే శంబుకుణ్ణి వధించాలనీ వాళ్లు, రాముడిని ఆజ్ఞాపిస్తున్నట్లుగా చెప్పారు.

అన్ని వర్గాలవారినీ తృప్తిపరుస్తూ రాజ్యపాలన చేయాలనే దీక్ష పట్టిన రాముడు వెళ్ళి, సాధు జీవనం గడుపుతూ తలక్రిందుగా తపస్సు చేస్తూన్న శంబుకుణ్ణి నరికాడు. అప్పుడు శంబుకుడి భార్య కపిల రాముడితో, "ఓ రాజా! నీకు ఏదో అనర్థం రాబోతూన్నది! దానికి సూచనగా ఇంతటి దారుణం చేశావు!" అని హెచ్చరించి, ప్రాణాలు విడిచింది.



అది జరిగిన కొద్ది రోజుల తర్వాత ఒకనాటి రాత్రి రాముడు, భద్రుడు కూడా వెంటరాగా మారువేషాలతో వేగు తిరుగుతూ అయోధ్య చివర ఒక రజకవాడ సమీపానికి వచ్చారు. అక్కడ ఆలుమగల తగువు జరుగుతూన్నది.

ఎక్కడికో వెళ్ళి కొన్నాళ్ళుండి వచ్చిన పెళ్ళాన్ని ఒక రజకుడు చావబాది ఇంటి గుమ్మం తొక్కనియ్యలేదు. రక్తం చిమ్ముతున్న వీపు చూపుకుంటూ రజకస్త్రీ భోరున వెక్కి వెక్కి ఏడుస్తూ, "ఆ సీతను రాముడంతటి మారాజే ఏలగాలేంది నువ్వేనా మహా మగాడివి?" అని అన్నది. తప్పతాగి తూలుతూన్న రజకుడు ఓండ్ర పెట్టినట్టుగా, "రాజును గదా, అడిగే వాడెవడూ, అనేవాడెవడూ అని అన్నాళ్ళు లంకలో పరాయివాడి దగ్గిరున్న దాన్ని తెచ్చుకుని సిగ్గుమాలి కులకడానికి నేను వెర్రి రాముణ్ణి కాను," అని అందరి ముందూ అరిచాడు.

దాని ఫలితంగా రాముడు సీతను అరణ్యంలో విడిచిరమ్మని లక్ష్మణుడికి ఆజ్ఞాపించాడు. అప్పుడు సీత నిండుచూలాలు. ఆ ముందటి రోజునే సీత తనకు ముని పల్లెలకు వెళ్ళి మునిపత్నులతో ముచ్చటగా గడిపి రావాలని కోరికగా ఉన్నదని రాముడితో చెప్పింది. ఆ నెపంతోనే లక్ష్మణుడు అన్న రాముడి ఆజ్ఞానుసారం, సీతను రథంలో తీసుకువెళ్లి అడవిలో విడిచి వచ్చాడు.

సీతను త్యజించి రాముడు నిద్రాహారాలు మాని కృంగిపోవడం భద్రుడు చూడలేక పోయాడు. భద్రుడు చిన్నతనంలో రాముణ్ణి ఎత్తుకొని తిప్పి లాలించి ఆడించిన వాడు. పసిరాముడు చందమామను ఇమ్మని మారాంపెట్టినప్పుడు అద్దం ఇచ్చి చందమామను చూపినప్పుడు తన ముఖాన్నీ, చంద్రబింబాన్నీ కలిపి అందులో చూస్తూ రాముడు ముద్దు ముద్దుగా రామ-చంద్రుడు అని పలికాడు. అప్పుడు భద్రుడు రాముడి పక్క తన ముఖాన్ని పెట్టి, మరి ఇప్పుడో? అని అడిగితే, రామ-భద్రుడు అని మరింత

ముద్దుగా అన్నాడు రాముడు. అప్పట్నించీ రాముడికి రామచంద్రుడు, రామభద్రుడు అనే పేర్లు వచ్చాయి. రాముడితో అలాంటి అనుబంధము ఉన్న భద్రుడికి ఆ రజకుణ్ణి పట్టి చిత్రవధ చేయాలనిపించి, రజకవాడకు వెళ్లి వాడిని గురించి విచారించాడు.

"అంతమాట అన్నందుకు మేమే వాణ్ణి పట్టి ఉతికేద్దామని పట్టుకోబోతే వాడు దొరక్కుండా పారిపోయాడు! వాడి పెళ్లామూ కనిపించలేదు!" అని అక్కడివాళ్ళు భద్రుడితో చెప్పారు.



లక్ష్మణుడు విడిచి వెళ్ళాక సీత నదీ ప్రవాహంలో కొండ రాతి మీదినుంచి దూక బోతూండగా వాల్మీకి మహాముని వారించి తన ఆశ్రమానికి తీసుకెళ్లాడు. సీత ఇద్దరుమగ కవల బిడ్డలను కన్నది. కుశుడు, లవుడు అని వారికి పేర్లు పెట్టి, వాల్మీకి విద్యాబుద్ధులు నేర్పాడు; తాను రచించిన రామాయణ కథను గానం చేయడం కూడా నేర్పాడు. సీత వాళ్లకు విలువిద్య నేర్పింది.

ఒకనాడు కుశలవులు రామాయణంలో రాముడెలాఉంటాడో, తమతల్లిపేరే గలసీత ఎలాంటిదోచూడాలన్నఉత్సాహంతోఅయోధ్యా నగరానికి రామకథను పాడుతూ వెళ్ళారు.

రాముడు సీతను కొంత మరిచిపోవ డానికి వసిష్ఠుడు మొదలైన పెద్దలు ఆలోచించి, రఘువంశ రాజులందరూ చేసి నట్లే లోకకళ్యాణం నిమిత్తం అశ్వమేధ యాగాన్ని చేయవలసిందని రాముడికి ఆదే శించారు. బంగారంతో మలచిన సీత విగ్ర హాన్ని పక్కనుంచుకుని రాముడు అశ్వమేధ యాగాన్ని ప్రారంభించాడు. అదే రోజున మునిబాలకులమని చెప్పుకొంటూ లవ కుశులు రామాయణం పాడుతూ అయోధ్యా నగరం వీధులు తిరుగుతూ వస్తున్నారు. లక్ష్మణుడు వాళ్ళను చూసి ఆశ్చర్యపడి వాళ్ళె వరై ఉండవచ్చునో కొంత అంచనాకట్టి రాజ మందిరానికి తీసుకువెళ్ళాడు.

రాజప్రాసాదంలో కుశలవులు సీత అగ్నిప్రవేశ ఘట్టాన్ని కన్నులకు కట్టేలాగ



పాడి వినిపించారు. అక్కడ ఉన్న కౌసల్య మొదలైన అంతఃపుర స్త్రీలూ, యాగం చేయిస్తున్న పెద్దలూ, పరివారమూ పుర ప్రముఖులూ అంతా కన్నీరు కారుస్తూ స్వర్ణ సీతను చూసి చేతులు జోడించి కళ్ళ కద్దుకున్నారు. రాముడు వాళ్ళు మునిబాలురనుకుంటూనే తెలియరాని ఆనందంతో వాళ్ళను దగ్గరకు తీసుకొని ముద్దాడి, అనేక కానుకలూ, విలువయిన చీనాంబరాలూ ఇచ్చి పంపాడు.

యాగ ప్రారంభ క్రియలన్నీ పూర్తయ్యాక రఘువంశ సూర్యపతాకంతో అలంకరించబడ్డ యాగాశ్వం స్వేచ్ఛగా స్వైరవిహారం చేయడానికి విడిచిపెట్టబడింది. ఆ గుర్రం దౌడు తీసి తిన్నగా వెళ్లి వాల్మీకి ఆశ్రమ సమీపాన్ని చేరింది. గుర్రం నుదుట ఉన్న బంగారు బాసికం చదివి, అది రాముడి యాగాశ్వంగా గుర్తించి దాన్ని పట్టి చెట్టుకు కట్టివేశారు లవకుశులు.

గుర్రాన్ని విడిపించడానికి వెళ్ళిన శత్రుఘ్న, భరత, లక్ష్మణులు కుశలవులతో యుద్ధం చేసి మూర్ఛపోయారు. రాముడు వెళ్ళి యుద్ధం చేశాడు.

కుశలవులు తమ తల్లి మహాసాధ్వి అని ప్రతిజ్ఞ చెప్పి విడిచిన బాణాలు తగిలి కింద పడి రాముడు మూర్ఛపోయాడు. సీత వచ్చి రాముడి పాదాలు తాకి తెలివి తెప్పించింది.

సీత ఎంతో పవిత్రురాలనీ, రాణిగా అయోధ్యకు తీసుకు వెళ్ళమనీ వాల్మీకి రాముడికి చెప్పాడు.

అందుకు రాముడు సీత ఆ విధంగా శపథం చేసి పౌరులను మెప్పించితే బాగుంటుందని అన్నాడు.

సీత అయోధ్యకు వచ్చి కుమారులను రాముడికి, అప్పగించి, "నా పవిత్రతకు నిదర్శనంగా భూదేవి నన్ను స్వీకరించును గాక!" అని పలికిన వెంటనే భూమి కంపించింది. దిక్కులు చీకట్లు కమ్మాయి. మెరుపులు మెరిశాయి. ఉరుములురిమాయి. అయోధ్యా పౌరులు ఇళ్ళ బయటకు వచ్చి కోలాహలంగా

పరుగులెత్తి అందరూ సీత ఉన్న చోట గుమిగూడారు. సీత నిల్చున్నచోట భూమి రెండుగా చీలింది. అందులోంచి మణిమయ సింహాసనం మీద కూర్చుని ఉన్న భూదేవి వచ్చింది. ఆ సింహాసనాన్ని నాగకాంతలు మోస్తున్నారు. భూదేవి సింహాసనం దిగి, తల్లి బిడ్డను తీసుకున్నట్లుగా రెండు చేతులతో సీతను ఎత్తుకొని సింహాసనం మీద తన ఒడిలో కూర్చుండ బెట్టుకొంది. భూమి మళ్ళా కంపించింది. అయోధ్యా నగరం ఊగిస లాడింది, కాని ఒక్క ఇంటి పెంకు అయినా రాలలేదు. సీతతో భూదేవి లోపలికి వెళ్లిపోయింది. చీలిన ఆనవాలైనా లేకుండా భూమి మూసు కుంది. అందరూ కన్రెప్పగట్టి కళ్ళప్పగించి చూస్తూండగా, అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది.

రాముడు ఆగ్రహంతో భూమిని చీలుస్తానని వింటికి బాణాన్ని సంధిం చాడు. అప్పుడు ఆకాశం నుంచి, "రామా! రఘువంశ రాజులందరూ భూమిని చల్లగా పాలించారు, నువ్వు భూమిని చీలుస్తావా? చేతులారా నువ్వే శపథం చేయించి సీతను పుట్టినింటికి పంపించి ఎందుకు ఆవేశపడతావు?" అని అశరీరవాణి వినిపిం చింది. రాముడు ఎత్తిన ధనుస్సు దించాడు, తల దించుకున్నాడు.

రాముడు లవకుశులను యువరాజులుగా సింహాసనం మీద కూర్చుండ బెట్టి, విషాద మూర్తిగా మిగిలాడు.

"అశ్వమేధం సాగుతూన్నది. యాగాశ్వం ఉత్తరం నుంచి తూర్పుగా వెళుతున్నది. లక్ష్మణ భరత శత్రుఘ్నులు సైన్యంతో దాని వెంట వెళ్తున్నారు," అని భద్రుడు చెప్పడం ముగించాడు.

శిలాప్రతిమ లాగ కన్నీరు కారుస్తూ వింటూన్న హనుమంతుడు కళ్లు ఒత్తుకొని, లేచి, "నే నిప్పుడే రాముడి దగ్గిరకు వెళుతున్నాను, నువ్వు వెనకగా రా!" అని భద్రుడికి చెప్పి, తన గదను భుజాన వేసుకొని, ఆకాశానికి ఎగిరి అయోధ్యకు వెళ్లాడు.






# తరగని ఆస్తి

విజయపురి అనే గ్రామంలో, రామదాసు అనే కూలివాడుండేవాడు. వాడి సంపాదన సరిగా పొట్ట నింపుకోవడానికి సరిపోయేది కాదు. ఒక్కొక్కసారి వాడి కుటుంబం పస్తు లుండవలసి వచ్చేది.

రామదాసుకు ఒక్కడే కొడుకు, వాడి పేరు శివదాసు. బాల్యం నుంచీ కూలి డబ్బుల కోసం తల్లిదండ్రులు పడే కష్టం చూస్తున్న వాడికి, మనసులో బలంగా ఒక కోరిక నాటుకుపోయింది. అదేమంటే — తను పెద్దయ్యాక తరగని ఆస్తి సంపాయించి సుఖసంతోషాలతో హాయిగా జీవితం గడ పాలని.

పదిహేనేళ్ళ వయసు వాడయ్యేవరకూ శివదాసు, తల్లిదండ్రులకు కూలినాలి పనుల్లో సాయం చేస్తుండేవాడు. వాడి తల్లికి హఠాత్తుగా జబ్బు చేసి, వారం రోజులపాటు మంచంలో వుండి చనిపోయింది. సరైన వైద్యసహాయం వుంటే, మరి కొంత కాలం బతికేదన్నారు ఊరివాళ్ళు. శివదాసు తమ పేదతనం కారణంగానే, తల్లిని కాపాడుకోలేక పోయాం అనుకున్నాడు. వాడిలో ఎలాఅయినాసరే తరగనిఆస్తి సంపాదించాలనే కోరిక మరింత బలపడింది.

ఆ తర్వాత రెండేళ్ళకు రామదాసు మరణించాడు. తండ్రి మరణం చూసి శివ దాసు బెంబేలెత్తిపోయాడు. ఆ స్థితిలో ఊరి పెద్ద భూషయ్య వాణ్ణి పిలిపించి, "శివా! నువ్వు ముందుముందు కష్టాల పాలవకూడ దని, మీ నాన్న నాదగ్గిర వంద వరహాలు దాచాడు. ఆ డబ్బు నీకిస్తాను. దానితో ఏం చేయదలిచావు?" అని అడిగాడు.

ఇదివిన్న శివదాసుకు ప్రాణం లేచివచ్చి నట్టయింది. వాడు భూషయ్యకు ఎంతో కాలంగా తన మనసులో వున్న కోరికను గురించి చెప్పాడు.

ఎస్. శివనాగేశ్వరరావు

భూషయ్య చిన్నగా నవ్వి, "ఆ తరగని ఆస్తి సంగతి అలా వుంచు. ముందు ఈ వంద వరహాలనూ వెయ్యి వరహాలు చేశాక, నాకు కనిపించు," అంటూ డబ్బు శివదాసుకు ఇచ్చాడు.

శివదాసు ఆ వంద వరహాలతో కోళ్ళ వ్యాపారం ప్రారంభించాడు. కొద్ది నెలల్లోనే అవి గుడ్లు పెట్టాయి. మొదట్లో వ్యాపారం లాభసాటిగా సాగినా, ఏదో తెగులు కారణంగా కోళ్ళు చచ్చిపోయాయి. ఎంతో శ్రమపడి వాడు వందవరహాలను రెండువందలు చేయగలిగాడు.

శివదాసు ఆ రెండు వందల వరహాలతో పది గొర్రెల్ని కొన్నాడు. అవి అడవిలో మేసేటప్పుడు, వాటిలో రెంటిని తోడేళ్ళు తినేశాయి. నాలుగు గొర్రెల్ని దొంగలెత్తుకుపోయారు. ఒకదానికి కాలు విరిగింది. గొర్రెల వ్యాపారం లాభసాటి కాదని తేలాక, శివదాసు మిగిలిన నాలుగు గొర్రెలను యాభై వరహాలకు అమ్మేశాడు.

ఆ డబ్బుతో వాడు పూల వ్యాపారం ప్రారంభించాడు. తెచ్చిన పూలన్నీ అమ్ముడుపోకా, కొన్ని వాడిపోయీ, వారం తిరక్కుండానే ఆ పూల వ్యాపారంలో పాతిక వరహాల నష్టం వచ్చింది.

అయినా, శివదాసు పట్టు విడవక, ఉన్న పాతిక వరహాలతో జంతికల వ్యాపారం మొదలుపెట్టాడు. ఒకరోజున వాడు సంతకు పోతూండగా, హఠాత్తుగా జడివాన కురిసి, బుట్టలో వున్న జంతికలన్నీ తడిసిపోయాయి.



వాటిని వాడు నష్టానికి అమ్మగా, అయిదు వరహాలు చేతికందినై.

వ్యాపారం చేసి తరగనిఆస్తి సంపాయించా లనుకుంటే, ఉన్న డబ్బే పోయినందుకు శివదాసు ఖిన్నుడై ఇంటిదారి పట్టాడు. ఆ సమయంలో వాడికి, ఒక నాలుగేళ్ళ పిల్లవాడు ఏడుస్తూ కనిపించాడు. పిల్లవాణ్ణి ప్రశ్నించి, వాడు పొరుగూరి రాజయ్యకొడుకనీ, తండ్రితో వచ్చి సంతలో తప్పిపోయాడనీ, శివదాసు తెలుసుకున్నాడు.

శివదాసు వాడికి మిఠాయి కొనిపెట్టి, వాళ్ళ ఊరు చేర్చాడు. ఇందుకు ఒక వరహా ఖర్చయింది.

పిల్లవాడి తల్లిదండ్రులు, శివదాసుకు కృతజ్ఞత చెప్పుకుని, "మేము కటిక పేదలం. నీ సహాయానికి ప్రతిఫలంగా ఏమీ ఇచ్చుకో లేము," అన్నారు.

ఆ మాటలకు శివదాసు నొచ్చుకుని, "నేను ప్రతిఫలం ఆశించి, మీ బిడ్డను ఇక్క డికి తేలేదు!" అని, అక్కడినుంచి తన ఊరు కేసి బయలుదేరాడు.

ఒకచోట వాడికి కాలిబాట పక్కన, చిన్న మూట ఒకటి కనిపించింది. విప్పి చూస్తే, అందులో వంద వరహాలున్నవి. అక్కడ వాడు ఎంతసేపు వేచి చూసినా, డబ్బు పోగొట్టుకున్నవాడు దానికోసం వెతుకుతూ అటుకేసి రాలేదు.

శివదాసు అక్కణ్ణించి బయలుదేరి కొంత దూరం వచ్చేసరికి, ఒకచోట గుంపుగూడి జనం కనిపించారు. వాళ్ళ మధ్య ఒక స్త్రీ





రోదిస్తున్నది. విచారించగా, సింగయ్య అనేవాణ్ణి పాము కరిచిందనీ, వైద్యం చేసేందుకు గాను వైద్యుడు వంద వరహాలు అడిగాడనీ, డబ్బు లేక సింగయ్య భార్య దుఃఖిస్తున్నదనీ తెలిసింది.

వెంటనే శివదాసు తనకు దొరికిన వంద వరహాల మూటను, సింగయ్య భార్యకిస్తూ, "అమ్మా! ఇక దుఃఖం వద్దు. ఇందులో వంద వరహాలున్నవి. తక్షణం వెళ్ళి, నీ భర్తకు చికిత్స చేయించు," అంటూ జనంలో నుంచి బయటికి వచ్చేశాడు.

అక్కడి నుంచి వాడు ఇంటి మార్గం పట్టి, మార్గమధ్యంలో వున్న చిట్టడవిగుండా నడుస్తూండగా, చింతామణి అనే బాటసారి కలిశాడు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తూండగా నలుగురుదొంగలు వాళ్ళను అటకాయించారు.

చింతామణి దగ్గిర కొంత బంగారం వున్నది. దొంగలు ముందుగా శివదాసు దుస్తుల్లో వెతికి, వాడిదగ్గిర డబ్బేమీ లేకపోవడంతో, చింతామణి కేసి తిరిగారు. ఈలోపల చింతామణి అతిలాఘవంగా తన దగ్గిరున్న బంగారాన్ని శివదాసు చేతి సంచీలో వేశాడు. దానితో దొంగలకు చింతామణి దగ్గిరా డబ్బు దొరకలేదు. వాళ్ళు, ఆ ఇద్దర్నీ తిట్టి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే చింతామణి, శివదాసు చేతి సంచీలోంచి బంగారం మూటను బయటికి తీసి, "నీ వల్లే నా బంగారం దక్కింది!" అని, శివదాసు వద్దంటున్నా వినకుండా, వాడికి కొంత బంగారం ఇచ్చి తన దారిన వెళ్ళిపోయాడు.

శివదాసు మరికొంత దూరం నడిచాక, దారి పక్కనవున్న ఒక చెట్టుకొమ్మకు ఉరిపోసుకునే ప్రయత్నంలో వున్న ఒక మనిషి కనిపించాడు. అతణ్ణి చూస్తూనే శివదాసుకు జాలితో పాటు కోపం కూడా కలిగింది.

వాడు, ఆ మనిషిని సమీపించి, "ఏం జరిగింది; ఛీ,ఛీ! ఈ చేసే చచ్చుపనేదో సొంత ఇంట్లోనే చేయక పోయావా? పనిగట్టుకుని ఇంతదూరంఎందుకొచ్చావు?" అన్నాడు చాలా కోపంగా.

వాడి పేరు దామోదరం. తీరా ముహూర్త సమయంలో, మగపెళ్ళివారికి ఇస్తానన్న కట్నం ఇచ్చుకోలేక, వాళ్ళ చేత నానా తిట్లూ తిని, అవమానంతో అడవి చేరి ఉరిపోసుకో చూస్తున్నాడు.

"ఇవ్వలేని కట్నం ఇస్తాననడం, నీ బుద్ధి తక్కువతనం. ఇదిగో, ఈ బంగారం తీసుకుపోయి, కూతురుపెళ్ళి సక్రమంగా జరిగేలా చూసుకో," అంటూ శివదాసు, దామోదరానికి తన దగ్గిరున్న బంగారమంతా తీసి ఇచ్చేశాడు.

దామోదరం కృతజ్ఞతాభావంతో కళ్ళనీళ్ళ పర్యంతమైపోయి, "బాబూ, చూడబోతే నువ్వు చాలా చిన్నవాడివి. ముక్కు మొహం ఎరగని నాకు ఇంత గొప్ప సాయం చేశావు. దేవుడు నీకు తరగని ఆస్తి ఇవ్వాలని దీవిస్తున్నాను. నువ్వు కాదనక నాతో వచ్చి, నా కూతురును దీవించాలి!" అని కోరాడు.

శివదాసు అతడి వెంట వెళ్ళాడు. పెళ్ళి సమయంలో ఒక పెద్దమనిషి, శివదాసును సమీపించి, "నువ్వు రామదాసు కొడుకువు కదా? నా పేరు నాగులయ్య. ఇప్పటికి నాలుగేళ్ళ కిందట అడవిలో దొంగలు కొట్టిన దెబ్బలకు చావుబతుకుల్లో వున్న నన్ను మీ నాన్న భుజానికెత్తుకుని ఇంటికి మోసుకుపోయి, నా ప్రాణం కాపాడాడు. ఇప్పుడాయన ఎలా వున్నాడు?" అని అడిగాడు.

శివదాసు, తన తండ్రి చనిపోయాడని చెప్పాడు. ఇది విని నాగులయ్య చాలా



విచారపడి, శివదాసును తన ఇంటికి తీసుకుపోయి కొత్త బట్టలు పెట్టి, "అప్పట్లో మీ నాన్నకు సహాయం చేసేందుకు చేతిలో డబ్బు లేక పోయింది. కాదనకు!" అంటూ వెయ్యి వరహాలు శివదాసు చేతిలో పెట్టాడు.

వాడు ఆ డబ్బుతో తన గ్రామం చేరి, భూస్వామి భూషయ్యను కలుసుకుని, వెయ్యి వరహాలు ఆయనకు చూపించి, "వంద వరహాలు వెయ్యి వరహాలు చేశాను! తరగని ఆస్తి సంపాదించగల సత్తా నాకున్నదని ఒప్పుకుంటారా?" అని అడిగాడు.

భూషయ్య తలాడించి, "ఇంతకూ, ఈ డబ్బు ఎలా సంపాయించిందీ చెప్పనే లేదు," అన్నాడు.

అప్పుడు శివదాసు, ఆయనకు జరిగిందంతా చెప్పాడు.

అంతా విని భూషయ్య చిరునవ్వు నవ్వి, "ఒరే, శివా! ఇంత అనుభవం తరవాత కూడా, నువ్వింకా తరగని ఆస్తి అంటే ఏమిటో, దాన్నెలా సంపాయించాలో గ్రహించలేక పోవడం ఆశ్చర్యంగా వుంది. నువ్వు మొండితనం కొద్దీ నీ స్వశక్తిని మాత్రమే నమ్ముకుని, అనుభవం లేని వ్యాపారాలు ప్రారంభించి పూర్తిగా నష్టాల పాలయ్యావు. ఇప్పుడు నీ దగ్గిరున్న వెయ్యి వరహాలూ, కేవలం నీ మంచితనం, దయాగుణాల కారణంగా సంపాయించిన డబ్బు. ఇందులో నీ సత్తా గానీ, వ్యాపారదక్షత గానీ ఏమైనా వున్నదా? ఆలోచించి చూడు!" అన్నాడు.

భూషయ్య మాటలతో శివదాసుకు కలల లోకం నుంచి, వాస్తవ లోకంలో అడుగు పెట్టినట్టయింది. వాడు చప్పున భూషయ్య పాదాలుతాకి, "అయ్యా! మీరు నాకళ్ళు తెరిపించారు. నేను తరగనిఆస్తి అనే పీడ కల నుంచి బయట పడ్డాను," అన్నాడు.

భూషయ్య వాణ్ణి చేయెత్తి దీవిస్తూ! "ఒరే, శివా! లోకంలో ఏ మనిషీ తరగనిఆస్తీ, చాలినంత డబ్బూ అంటూ సంపాయించ లేడు. కారణం ఏమంటే – ఆ రెంటికీ ఇవి అంటూ హద్దులూ, ఎల్లలూ లేవు!" అన్నాడు.

అప్పుడు శివదాసు ఎంతో వినయంగా, తన దగ్గిరున్న వెయ్యి వరహాలనూ భూషయ్య ముందు పెట్టి, "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారో తమరే చెప్పండి అలా నడుచుకుంటాను," అన్నాడు.

"నీకు ఇష్టమైతే నా వ్యవసాయప్పనుల్లో సాయపడు. మంచి జీతం ఇస్తాను; నిన్ను ఒక ఇంటి వాణ్ణి చేస్తాను. డబ్బు విషయంలో ఒకటే గుర్తుంచుకో – నిష్ప్రయోజనంగా డబ్బు ఖర్చు చెయ్యక పోవడమే తరగని ఆస్తి!" అన్నాడు భూషయ్య.

ఆ తర్వాత శివదాసు, అన్ని పనుల్లో భూషయ్యకు సాయపడుతూ మంచివాడు, సమర్థుడు, నమ్మకస్థుడు అని పేరు తెచ్చుకుని, పెళ్ళి చేసుకుని చాలా కాలం సుఖంగా జీవించాడు.



# చందమామ కబుర్లు



## అతి చిన్న పుస్తకం



స్వీడన్‌లోని ల్యాండ్స్‌క్రోనా నగరంలో అతి చిన్న ఖురాను గ్రంథం ఉన్నట్టు తెలియవచ్చింది. మూల అరబ్ భాషలో ఉన్న ఆ గ్రంథం 2.7 సెం.మీ. మందం మాత్రమే ఉన్నది. ఆ పుస్తకం సొంతదారు అది తన తండ్రి నుంచి తనకు సంక్రమించినట్టూ, తన తండ్రి దానిని 1960-63 సం॥ల మధ్య ఒక వేలంపాటలో కొన్నట్టూ చెబుతున్నాడు. ఇంతవరకు చైనాలోనే అతిచిన్న పుస్తకం ఉన్నట్టు చెప్పుకునే వాళ్ళం. ఇప్పుడు స్వీడన్‌లో లభించిన ఈ పుస్తకం 'గిన్నిస్‌బుక్ ఆఫ్ రికార్డ్స్'లో చోటుచేసుకోనున్నది.



## 'ఐస్ ట్రెయిన్!'

అధునాతన సౌకర్యాలతో ప్రపంచంలో అత్యంత వేగంగా నడిచే రైలును జర్మనీలో రూపొందించారు. ఇది ఐస్ మీద నడవదు. కాని, దీని పేరు మాత్రం 'ఐస్ ట్రెయిన్!' ఇది గంటకు 250 మైళ్ళ వేగంతో నడుస్తుంది. అమెరికాలోని 'ఆమ్ ట్రాక్' అనే ఒక ప్రైవేట్ రైల్ రోడ్ కంపెనీ 25 రైళ్ళను కొంటుంది. 1994 జనవరి నుంచి అమెరికా వాయవ్య ప్రాంతంలో ఈ రైళ్ళు నడుస్తాయి.

## వీడియోలో 'పట్టుబడిన' దయ్యం!



అప్పుడప్పుడు దయ్యాలను ఫొటోలు తీశామనే ఉదంతాలు వింటూ ఉంటాం. దయ్యం తిరగడాన్ని ప్రప్రథమంగా వీడియో కెమెరాలో 'బంధించడం' ఇటీవల జరిగింది. ఫిజీ దీవుల పార్లమెంటు భవనంలో ఒక దయ్యం తిరుగుతూండడం కాపలా వాళ్ళు చూసి, దానిని వెంటనే వీడియో కెమెరాలో రికార్డు చేశారు. తరవాత ఆ టేపను ప్రధానమంత్రికీ, ప్రతిపక్ష నాయకుడికీ పంపారు. వాళ్ళు దానిని చూసి, ప్రసారానికి అనుమతించారు. మనిషి నీడలాంటి ఆకారం ఒక గదిలో తిరుగుతూ కనిపించింది. అది ఫిజీ సంప్రదాయ దుస్తులను, అంటే చెట్టు బెరడులను నడుముకు చుట్టుకుని ఉన్నట్టు కనిపించింది!

## మరణించిన మశూచి!

పిల్లలకు మశూచి టీకాలను నిన్నమొన్నటి వరకు నిర్బంధించి వేయించేవారు. ఎందుకంటే దారుణమైన ఆ అంటువ్యాధికి గురై వేలాది మంది ప్రజలు ముఖ్యంగా ఇరవై ఏళ్ళకు లోబడిన యువతీయువకులు, పిల్లలు బలైపోయేవారు. ఆ మహమ్మారికి కారణమైన వ్యాధిక్రిములను కనుగొన్న తరవాత, ఆ వ్యాధిని భూమిపై నుంచి నిర్మూలించే ప్రయత్నాలు జరిగాయి. అవి విజయవంతమయినాయి. కొన్నేళ్ళుగా ఎవరికీ, ఎక్కడా మశూచి సోకిన దాఖలాలు లేవు. ఆ వ్యాధికారక క్రిములను పరిశోధనశాలలలో మాత్రమే పరిశోధనల కోసం భద్రపరచి ఉన్నారు. డిసెంబర్ 31వ తేదీ ఆ వ్యాధిక్రిములను కూడా నాశనం చేయాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్ణయించింది!




# గంగాస్నానఫలం

ఒక ఊళ్ళో ఒక అమాయకుడైన బ్రాహ్మణ గృహస్థు ఉండేవాడు. ఆయన ఒకనాడు ప్రమాదవశాత్తూ ఏదో పాపకృత్యం చేశాడు. దానికి ప్రాయశ్చిత్త మేమిటని పెద్దల నడిగితే, గంగాతీరానికి వెళ్ళి, బతికి ఉన్నంత కాలమూ గంగాస్నానాలు చేస్తూ, దైవధ్యానం చేస్తూ ఉన్నట్టయితే పాపం పరిహార మవుతుం దన్నారు.

అందుచేత బ్రాహ్మడు తన యావదాస్తీ తన కొడుక్కు అప్పగించి, తాను కర్రా బుర్రా తీసుకుని గంగను వెతుక్కుంటూ బయలు దేరాడు. వెళ్ళగా వెళ్ళగా ఆయనకు ఒక వాగు తగిలింది. ఆ వెర్రి బ్రాహ్మడు, ఆ వాగును చూసి, అదే గంగ అనుకుని, భక్తితో అందులో స్నానాలుచేస్తూ, దాని ఒడ్డున కూచుని భగవధ్యానం చేసుకుంటూ అయి దేళ్ళు గడిపాడు. ఒకనాడు ఒక శివభక్తుడైన సన్యాసి అటుగా వెళుతూ బ్రాహ్మడితో, "నాయనా, ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

దానికి బ్రాహ్మడు, "స్వామీ, నేను నేరక ఒక మహాపాపం చేసి, దాన్ని పోగొట్టుకునే టందుకు ఈ గంగాతీరాన దైవధ్యానం చేసు కుంటున్నాను," అని జవాబు చెప్పాడు.

"ఈ ముష్టివాగునా గంగ అంటున్నావు?" అని సన్యాసి అడిగాడు.

"స్వామీ, ఇది గంగానది కాదా?" అని బ్రాహ్మడు ప్రశ్నించాడు.

సన్యాసి పెద్దగా నవ్వి, "ఓయి వెర్రివాడా! గంగకూ ఈ వాగుకూ హస్తిమశకాంతరం కాదా? చెదలపుట్టను మేరు పర్వతమను కుంటివే? నీవంటి అమాయకుడుంటాడని నేను కలలో కూడా అనుకోలేదు. నువ్వు వెళ్లదలుచుకున్న గంగానది ఇక్కడికి ఎన్నో వందల కోసుల దూరాన ఉన్నది," అని బ్రాహ్మడికి చెప్పాడు.

25-ఏళ్ళనాటి చందమామ కథ

"స్వామీ, నాకు మహోపకారం చేసి ఎంతో పుణ్యం కట్టుకున్నారు," అంటూ బ్రాహ్మడు తన కర్రా, బుర్రా తీసుకుని వాగు ఒడ్డు నుంచి కదిలి, నడవగా నడవగా ఒక చిన్న నది తగిలింది. అది తప్పక గంగ అయి ఉంటుందని బ్రాహ్మడు ఎంతో సంతోషించి, అందులో స్నానాలు చేస్తూ, దాని ఒడ్డున కూచుని దైవధ్యానం చేసుకుంటూ మళ్ళీ అయిదు సంవత్సరాలు గడిపాడు. ఆ తరవాత ఒకనాడు అటుగా ఒక కాపాలికుడు వెళుతూ, బ్రాహ్మణ్ణి పలకరించి, "ఊరూ పేరూలేని ఈ నదీతీరాన తపస్సు చేస్తూ అయిదు సంవత్సరాలు గడిపావా? ఎంత వెర్రివాడివి? ఈపనే గంగాతీరాన చేసినట్టయితే నీకు పుణ్యం వచ్చి ఉండునే!" అన్నాడు.

బ్రాహ్మడు ఉలిక్కిపడి, "అదేమిటి, స్వామీ? ఇది గంగానది కాదా?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఇదా గంగ? నక్క ఎక్కడైనా సింహమవుతుందా? ఈ నదికీ, గంగకూ సామ్యమే లేదు," అన్నాడు కాపాలికుడు.

"స్వామీ, తమరు ఇలా వేంచెయ్యటం ఎంతో మంచిదయింది. నాకీ సంగతి చెప్పి మీరెంతో పుణ్యం సంపాదించుకున్నారు," అంటూ బ్రాహ్మడు తన కర్రా బుర్రా తీసుకుని, ఆ నదీ తీరాన్నుంచి బయలుదేరి నడవగా, నడవగా కొన్నాళ్లకు నర్మదానదివచ్చింది. "ఇది తప్పక గంగే!" అని రూఢి చేసుకుని, బ్రాహ్మడు రోజూ ఆ నర్మదలో స్నానాలు చేస్తూ అక్కడే అయిదేళ్ల కాలం వుండిపోయాడు.



ఇలా ఉండగా ఒకనాడు ఒక యాత్రికుడు అటుగావచ్చి, బ్రాహ్మడు కూచుని ఉన్నచోటనే నదిలో పూలు చల్లి, నదిని "నర్మదా!" అని సంబోధించి స్తవం చెయ్యసాగాడు.

బ్రాహ్మడు ఆ యాత్రికుణ్ణి సమీపించి "అయ్యా, ఈ నది పేరేమిటి?" అని అనుమానంతో అడిగాడు.

"ఇది మహాపవిత్రమైన నర్మదానది కాదటండి? ఆ సంగతి మీకు నిజంగా తెలియనే తెలియదా?" అని యాత్రికుడు బ్రాహ్మణ్ణి ఎదురు ప్రశ్నించాడు.

బ్రాహ్మడు దీర్ఘంగా నిట్టూర్చి, "అయ్యా, మీరు నాకు చాలా మేలుచేశారు!" అంటూ తన కర్రా బుర్రా తీసుకుని మళ్ళీ అక్కడి నుంచి కదిలాడు.

అయితే ఇప్పుడు బ్రాహ్మడి శక్తి యావత్తూ ఉడిగిపోయింది. ఇల్లు బయలుదేరి పదిహేనేళ్ళయింది. వయసు మళ్ళిపోయింది. దానికితోడు తపస్సుతో ఆయన శరీరం శుష్కించింది. అందుచేత ఆయనకు ప్రయాణం అతికష్టమనిపించింది. పగలు ఎండబాధ హెచ్చుగా ఉంది. నీరసం చేత కాళ్ళు చురుకుగా కదలటంలేదు. అయినా, ఆయన పట్టుదలతో పడుతూ లేస్తూ ప్రయాణం చేశాడు. చివరకు నడవలేని స్థితి వచ్చింది. అయినా ఆయన పాకుతూ, దేకుతూ ప్రయాణం సాగించాడు. తన శరీరంలో ఊపిరి ఉన్నంత దాకా శరీరాన్ని ఈడ్చుకుంటూ వెళ్ళి వెళ్ళి చిట్టచివరకు ఒక గుట్టమీది నుంచి గంగానదిని కళ్ళ చూశాడు. గంగలో స్నానాలు చేసే అసంఖ్యాకులైన యాత్రికులను చూశాడు. బ్రాహ్మడి హృదయం ఆనందంతో నిండిపోయింది. ఆయన అక్కడే ప్రాణాలు వదిలాడు. యమదూతలు ఆయనను యమధర్మరాజు దగ్గిరికి తీసుకుపోయారు.

"ఈ మనిషి ఏమేం పాపాలు చేశాడు?" అని యముడు చిత్రగుప్తుణ్ణి అడిగాడు.

"ఒకే ఒక పాపకార్యం చేశాడు. కాని, పదిహేనేళ్లు గంగాస్నానాలు చేసినందువల్ల ఆ పాపం పరిహారమయింది," అని చిత్రగుప్తుడు చెప్పాడు.





## ప్రకృతి వింతలు:

### చిలుకలు

అందమైన పెంపుడు పక్షులలో చిలుకలు ప్రధానమైనవి. వీటికి మాటలు కూడా నేర్పుతారు. చిలుకలలో మూడువందల పైచిలుకు జాతులు ఉన్నాయి. వీటిలో డెబ్భై జాతులు నశించిపోయే స్థితిలో ఉన్నాయి. మధ్య అమెరికాలోనూ, దక్షిణ అమెరికాలోనూ ఉన్న 'మాకాస్' అనే చిలుకలు అన్నిటిలోకీ పెద్దవి. న్యూగినియాలోని 'పెగ్మీపేరట్స్' అన్నిటికన్నా చిన్నవి. మామూలుగా చిలుకలు పచ్చగానూ, ముక్కులు ఎర్రగానూ ఉంటాయి. మెక్సికోలోని సిందూరవర్ణం చిలుకలే (చిత్రంలోనివి) చిలుకలన్నిటిలోకీ చూడడానికి అందంగా ఉంటాయి. పెద్ద చిలుకలు దాదాపు 85 సెం.మీ. పొడవూ, చిన్నవి 10 సెం.మీ. పొడవూ ఉంటాయి. న్యూజీలాండ్‌లోని 'కియా' అనే చిలుకలు మాత్రమే మాంసం తింటాయి. వంపు తిరిగిన ఎర్రటి ముక్కూ, రెండు వేళ్ళు ముందుకూ, రెండు వేళ్ళు వెనక్కూ తిరిగి వున్న కాళ్ళూ చిలుక ప్రత్యేకతలు.



### ముళ్ళపంది చేప

ఆత్మరక్షణ కోసం ప్రకృతిలో జంతువులు రకరకాల మార్గాలను అనుసరిస్తున్నాయి. ఇందుకు చక్కటి ఉదాహరణ ముళ్ళపంది చేప. తనను మింగడానికి మరేదైనా జంతువు వస్తున్నదని తెలియగానే ఈ చేప, కడుపు నిండా నీళ్ళు తాగి శరీర పరిమాణాన్ని పెంచి గుండ్రటి బంతిలాగా తయారవుతుంది. దాంతో శరీరం మీది ముళ్ళు నిక్కపొడుచుకుంటాయి. అంతే, మింగడానికి సమీపించిన జంతువులు వీటిని చూసి బెదిరి వెనుదిరిగిపోతాయి.



### గులాబీల నుంచి జపమాలలు!

గులాబీ లంటే ఇష్టపడని వాళ్ళుండరు. జవహర్‌లాల్ నెహ్రూకు గులాబీ లంటే ఎంతో ఇష్టమని అందరికీ తెలిసిందే. ఆయన ఎప్పుడూ ఒక గులాబీని కోటుకు ధరించే వాడు. ఈ గూలాబీ మొక్కలను మొగలులు తమ మాతృభూమి అయిన పర్షియా నుంచి మన దేశానికి తెచ్చారు. అరవ శతాబ్దంలో పర్షియాను 'గులాబీ భూమి' అని చెప్పుకునే వాళ్ళు. అక్కడి గులాబీ తోటలలో 'గులిస్తాన్' ప్రపంచ ప్రసిద్ధి గాంచినది. ఈ తోటలను దాటడానికి గుర్రం మీద ఆరు రోజులు ప్రయాణం చేయవలసి ఉండేదట. క్రీ.పూ. 3,000 సం॥ నాడే చైనాలో గులాబీ తోటలుండేవి. మైదాసు గులాబీ మొక్కలను గ్రీకు దేశానికి తీసుకువెళ్ళాడు. గులాబీ రేకులను నలిపి, ఎండబెట్టి, నల్లటి రంగు వేసి భక్తులు ఉపయోగించే జపమాలలు తయారుచేస్తారు!

# కేవలం మీ అమ్మాయి శ్రమించి పని చేసినంత మాత్రాన ఉండదు ప్రయోజనం. దూరాలోచనతో మీరు చేపట్టిన పథకంతో కాగలదు ఆమె భవిష్యత్తు ఉజ్వలం.






విజయం సాధించాలనే దృఢనిశ్చయంతో మీ అమ్మాయి రాత్రింబవళ్ళు ఒకటిచేసి చదవవచ్చు. అయితే ఆమె లక్ష్యసాధనలో సహాయకరంగా వుంటుంది యుటిఐ చిల్డ్రన్స్ కాలేజ్ అండ్ కెరియర్ ఫండ్‌లో మీరు పెట్టిన పెట్టుబడి.

మీ అమ్మాయి 15 సంవత్సరాల లోపు వయస్సుదయితే, మీరు వెంటనే దీనిలో పెట్టుబడి పెట్టి ఆమె భవిష్యత్తుకు మంచి పునాది వేయండి. ఈ పెట్టుబడి ఆమె కాలేజీ జీవితం ఒడుదుడుకులు లేకుండా సాగిపోవడానికి తోడ్పడుతుంది. లేదా ఆమె కెరియర్‌కు ఇదొక చక్కటి ప్రారంభం. వివిధ దశలలో రొక్కం తీసుకొనే సదుపాయం కల్గి వుండడంతో ఈ ఫండ్‌తో ఆమె ట్యూషన్ ఫీజులు, ఇతర ఫీజులు చెల్లించే పని సులభం. ఏటేటా ప్రతి ఏటా మీరు ఎంత ఎక్కువ పెట్టుబడి పెట్టితే, ఆమె భవిష్యత్తు కూడా అంతే ఎక్కువ ఉజ్వలం కాగలదు. మీ పెరిగే అమ్మాయితో పాటు పెరిగేలా యుటిఐ మీ డబ్బును పెట్టుబడిగా పెడుతూంటుంది. కనుక మీరు పెట్టిన పెట్టుబడి వృద్ధి చెందుతూ వుంటుంది.




- గడువు పరిమితిలేని పథకం.
- 15 ఏళ్ళదాకా వయస్సుగల పిల్లలకోసం ప్రత్యేక పథకం. 18 నుంచి 23 ఏళ్ళ వయస్సు దాకా వివిధ దశలలో పైకం తీసుకునే వీలు.
- ప్రతి యూనిట్ రూ. 10/- కనీసపు పెట్టుబడి రూ. 2000/- ఆటుపైన రూ. 500/- గుణిజములలో 15 ఏళ్ళదాకా వయస్సుగల మీ పిల్లల కోసం ప్రత్యేక పథకం.
- ఫండ్‌తో పొందే వృద్ధి బోనస్ యూనిట్ల రూపంలో నిర్ణీత సమయాలలో జమ చేయబడుతుంది.
- ఏడాదికి రెండుసార్లు అంశికంగా రొక్కం తీసుకొనే సదుపాయం. 18 ఏళ్ల వయస్సప్పుడు 50% మరియు 23 ఏళ్ళ వయస్సు వరకు అదనంగా 10% ప్రతి ఏటా.
- మరో ఆసామి పేరిట మార్చుకొనేందుకై నామినేషన్ సదుపాయం.

దరఖాస్తు ఫారములకు ఏ యూనిట్ ట్రస్ట్ ఆఫీసునైనా, ముఖ్య ప్రతినిధులను లేదా ఏజంట్లను, సంప్రదించండి.



**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

శ్రేయోభిలాషమైన రేపటి కోసం.

సెక్యూరిటీ పెట్టుబడులన్నిటి వెనుకా మార్కెట్ రిస్కు ఉంటుంది. పెట్టుబడి పెట్టే ముందుగా మీ పెట్టుబడి సలహాదారును గానీ, ఏజెంటును గానీ సంప్రదించండి



**CHILDREN'S COLLEGE AND CAREER FUND**

UNIT PLAN-93

ఎందుకంటే మీ పిల్లల భవిష్యత్తును తీర్చిదిద్దే బాధ్యత మీది.

**ప థ కం 1 2 జూ లై 1 9 9 3 నుం చి ప్రా రం భ మై న ది.**

జోనల్ ఆఫీసు: 29, రాజాజీ సాలై, మద్రాసు 600 001, ఫోను: 517101.
బ్రాంచి ఆఫీసులు: హైదరాబాదు, ఫోను: 511095 • విశాఖపట్నం, ఫోను: 50275 • విజయవాడ, ఫోను: 63964.

UTI.57.93 TE A

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Phal Singh Girota

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *నవంబర్ నెల 15వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బయటకు పోవడమెలా?

రెండవ ఫోటో : పట్టుకుంటే ఇలా!

పంపినవారు : పచ్చిగోళ్ళ వెంకటరత్నమాల, W/O పి. నాగరాజు, మెయిన్‌రోడ్, అమలాపురం, తూ. గో. జిల్లా (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

Bakeman's

# YOU'LL DROP



## Everything for BAKEMAN'S

# MILK DROPS





